# సతీ అనసూయ

(ఆఱంకముల నాటకము)

గ్రంథకర్త:

కొర్నెపాటి శేషగిరిరావు

టీచర్, మేనేజరు - హిందూ ఎలిమెంటరీస్కూలు,

చేబ్రోలు, తెనాలితాలూకా.

ప్రకాశకులు:

వేంకట్రామ & కో., బెజవాడ

పబ్లిషర్సు అండ్ బుక్ సెల్లర్సు.

[ప్రథమ ముద్రణ: 1000 ప్రతులు.] [వెల రు 1-8-0

## అ ర ణ ము

అనుపమ సాధ్వీచరితము
ఘనతర సంపత్కరంబు కళ్యాణద మీ
అనసూయాభిధరూపకము
అనసూయకు నాదుసుతకు నరణంబిత్తున్.

కాపీలు 1000/ 25-11-46 భారతీ ప్రెస్, తెనాలి.

# దేశోద్ధారక విద్యాపరిషత్తు, చేబ్రోలు



ముందువరుస - 1. మేడూరి గోవిందాచారిగారు, జాయింటు సెక్రటరీ. 2. పల్లపోతు పున్నారావుగారు, ప్రెసిడెంటు. 3. గ్రంథకర్త. 4. సుంకా రాధాకృష్ణమూర్తిగారు, సెక్రటరీ.

రెండవ వరుస:- 1. పినపాల నాసరదాసుగారు, యక్స్ సెక్రటరి. 2. గోళ్లమూడి చిదంబరరావుగారు, యక్స్ ప్రెసిడెంటు.

# విజ్ఞప్తి

ఈ యనసూయా నాటకమును నేనెప్పుడో పదునైదేడుల క్రిందట రచించితిని. ఆర్థిక దుస్థితివలన నింతవరకుఁ బ్రకటించుకొనఁ జాలకుంటి. నేటికిఁ బెక్కురు మిత్రుల ద్రవ్యసహాయమున నీకార్యము గట్టెక్కినందులకు నేను వారి మేలు మరువఁజాల.

అడిగినంత నాయందు దయయుంచి శ్రమయనక చక్కని పీఠికను వ్రాసియిచ్చిన మిత్రసత్తములు 'భాషాప్రవీణ' పెళిపాటి సూర్యనారాయణగారికిని, అనుగ్రహమున సదభిప్రాయము లొసంగిన సాహిత్య బంధువులు 'కవిబ్రహ్మ' ఏటుకూరి వెంకటనరసయ్యగారికిని, సూరశిఖామణులు ఎం. వర్తి రోశయ్యగారికిని, ఆత్మబంధువులు ఏటుకూరి సీతారామయ్యగారికిని, ఆబాల్యమిత్రులు నల్లూరి జగన్నాథాచార్యులు గారికిని, నా కృతజ్ఞతావందన సహస్రము లర్పించుచున్నాను.

ఇట్లు,
విద్వద్విధేయుఁడు
కృతికర్త.

# పశ్రంస

శ్రీలీలానటుఁగ్రైన విష్ణుపద రాజీవమ్ముల౯ ప్రాలి గా
హాళిం గౌగిటఁ గ్రుచ్చి వక్షమును మూర్ధాగ్రాణమున్ సల్పు నా
శ్రీలక్ష్మీ సుకటాక్ష వీక్షణము నర్తించున్ ధిమింధింధిమీ
తాళస్ఫూర్తిని ఈపిరాస్వయు శిరస్థానాగ్రభాగమ్మున౯

పరమ యుగంధర ప్రజ్ఞావిభాసిత
విపుల తంత్రజ్ఞు లార్వేలవారు
కవిసార్వభౌమ విఖ్యాత సారస్వత
విభ్రాజమాను లార్వేలవారు
దానభాస్కర యశోదార తేజోన్నత
వితరణశాలు లార్వేలవారు
ఖడ్గనారాయణ ఖ్యాతప్రభూషిత
వీరాధివీరు లార్వేలవారు

అందు ఈదర వంశసుధాంబురాశి
పూర్ణ శుభ్రాంశుమండల స్ఫూర్తిమూర్తి
దానధారాప్రవాహ కందళితకీర్తి
రమ్యగుణతంత్రి వేంకటరాయమంత్రి.

# తొలినుడి

ఈ 'అనసూయ' నాటకరచయిత శ్రీయుత కొర్నెపాటి శేషగిరి రావుగారు. వీ రాంధ్రమున విస్పష్టమైన భావముతో గవిత నడుపఁ గల సమర్థులు. వీరికవిత రసోత్సేకమై, సమయోచిత పదగుంఫితమై జాతీయ లోకోక్తుల కాటపట్టై యుండును.

పాత్రపోషణ:— ఈ నాటకమందలి కథావస్తువు పురాతనమైనదైనను నూతనభావసమ్మిశ్రితము. ప్రకృతిని మానవజీవితమునఁ బ్రతిబింబింపఁజేయుటయే నూతనత. అది గంగయొక్క ప్రవాహగతియందును, లక్ష్మి ప్రభావమందును, గౌరి సామర్థ్యమందును, సరస్వతి వాఙ్నైపుణియందును స్పష్టముగా గోచరించుచున్నది. అత్రి యనసూయల ప్రశాంత నిరాడంబరజీవితము, ఆనుగుణ్యము, నమ్రభావము, ప్రకృతిసిద్ధములై యాధునిక యువతీయువకులకుఁగూడ నాదర్శప్రాయముగఁ జిత్రితమైనవి. వారి యాశయములు ప్రకృతిసిద్ధములు. (34, 35, 36, 37 పుటలు చూడుడు). ఏకాలమునందైనను మూఢపాతివ్రత్యము కొఱకుఁ బెనగులాడుకొను యువతీబృంద ముండుననుట కుదాహరణముగ నర్మద చరిత్రము చిత్రింపఁబడినది. ఇంద్రసభయందలి చర్చవలన నిట్టి పాతివ్రత్య మనుత్తమమైనదని తోచెడిని. నారద సంధాన కర్తృత్వము చక్కగా నెఱవేఱినది. సమాజమున స్త్రీల కుండఁదగిన స్థానము కవిగారు భరతవాక్యమున విశదీకరించియే యుండిరి.

రసప్రశంస:— ఈ నాటకము కరుణరసప్రధానమై హాస్యాద్భుతము లంగములుగ నొప్పారుచున్నది. వైదర్భీరీతితోను, భారతీవృత్తితోను గూడి ద్రాక్షాపాకమున వెలయుచున్నది. సంభాషణముల మాధుర్యము వెల్లివిరియుచున్నది.

నెరసు:— ఇందుద్దండుని ముఖమున భక్తాగ్రగణ్యుఁడైన రామదాసునిఁ బ్రశంస జేయింపఁబడినది. (67 వపుట). ఇక్ష్వాకులకాలము నాటి యుద్దండునకును, నిన్నమొన్నటి రామదాసునకును గాలవైపరీత్యము సంభవించును. ఇట్టివి యొకటిరెండెచ్చటనైన నుండినను 'ఏకో హిదోషో గుణసన్నిపాతే నిమజ్జతీందోః కిరణేష్వివాంకః' అను కాళిదాస

వచనమున్నదిగదా! ముద్రణాస్ఖాలిత్యములు గూడ నచ్చటచ్చట గానవగుచున్నవి. గ్రంథవిస్తరభీతిచే రసవత్తరములైన పద్యములఁ గొలదిగనుదాహరించుచున్నవాఁడ.

1. ఉపమానసంపద:—

గీ. ఎపుడు దీపము పెద్దదా నెపుడు క్రమ్ము
కొందమా యని స్తంభము కూడఁ గూడ
దిరుగుచుండిన చీఁకట్ల తీరుగాను
పాపములు వేచియుండె నా పాటుఁకొరకు.

అనసూయచే బాల్యావస్థ నొందింపఁబడిన విష్ణువు—

గీ. బోరగిలఁబడి పృష్ఠమేపార నెత్తి
మొగములేవక ధారుణి మోదఁదొడఁగె
మొట్టితోడను పదముల ముట్టిముట్టి
రహిగదల్చెడి యాదివరాహమట్లు.

47 వ పుటలోఁ బ్రకృతికిని యజ్ఞమునకును జక్కగాఁ బోల్పఁబడినది

2. లోకోక్తులు:— (నాతిదా... (31 పుట) హరుని కనుమంట (49 పుట) చీఁకటికి(...100 పుట)

3. ధ్వనిసౌభాగ్యము:— సిరిగలవారింటి... (7 పుట) పోవు ... నంతకు... (20 పుట)

4. దేశీయముల కూర్పు:— విసముకుత్తుక... (22 పుట) ... కన్నుమూత... (90 పుట)

5. ఉద్యానవర్ణనము:— రాగయుక్తంబులు... (43 పుట)

వేయేల! ఈనాటకము పాత్రపోషణాకౌశలము, కవితాదీప్తి, రసోన్మీలనము, అశ్లిష్టసంధిబంధతలతోఁగూడి మనోహర- సముచిత వర్ణనాయుతమై యొప్పారుచున్నది. పురాతనగాథ కిట్టి నూతనతఁ గల్పించిన కవిపుంగవుని 'అమత్యహస్తము ప్రశంసార్హము.

యస్. యస్. హైస్కూలు
చేబ్రోలు, 7-11-46

భాషాప్రవీణ, పిశిపాటి సూర్యనారాయణ.
ఆంధ్రపండితుఁడు

# ఆభాషణములు

సాహిత్యబంధువులు, శ్రీ కొర్నెపాటి శేషగిరిరావుపంతులుగారు మా కన్నిమెడల దగ్గరవారు.

వారి కావ్యఖండములు పెక్కు వింటిని. ఇటీవల రచన లెంతయు ముద్దుగొల్పినవి. తన ప్రప్రథమరచన మీనాటకము జాతీయగుణ గాన మొనర్చినది.

ఇతివృత్తము ప్రాచీనము; భావము సరిక్రొత్త అగుటచే నది యొంతయు మాననీయము.

వీరు తెనుఁగు కూడలి - కొండపరటిసీమ వారగుటచే అందలి తెనుఁగు పోడుములిందు విజ్జరాలినవి.

భావప్రధానమగు నేటి భావుకలోకము ఆశించు నభ్యుదయ మిం దనుపదమున వెల్లివిరసినది.

వృత్తధర్మము విడనాడి, నాటకమర్యాద ననుసరించిన వీరి తొలిజతనము మిక్కిలి శ్లాఘ్యము.

ధర్మాదు లుగ్గడించుటకుగాఁ బ్రసంగ మించుక దీర్ఘీకరించిరి. అయినఁ జెఱకునకు వంకలున్న నేమి!

ఈ చేయి దృశ్యకావ్యము పట్లనేగాక శ్రవ్యకావ్యమువంక నెక్కుడు మొలునూపుచున్నట్లున్నది.

పొరపాటులు సహజములు. నేఁటి ముద్రణాలయము లిందు లకు దోహకారులు. అదిగో! నిం దట నట కవి యనుకోని స్ఖాలిత్యములు దొరలినవి. కాని పఠనమున కడ్డంకి గావనుకొందును.

చూతుగా! ఈ జాతీయకవి మలిరచన మేజాతీయకావ్యము వెలార్చునో? వెంటనే దాని పఠింప దొరకొందును. నాకీ రచన మొనగూర్చిన యుత్సాహ మిదియని మఱిమఱి చెప్పుచుంటిని.

నిడుబ్రోలు, }
9-11-48, }

ఇట్లు,
కవిబ్రహ్మ, ఏటుకూరి వేంకటనరసయ్య.

శ్రీయుతులు కొర్నెపాటి శేషగిరిరావు పంతులుగారు తాము పదియేడు సంవత్సరముల క్రిందట రచించిన "అ న సూ య" యను నాటకమును దయతో నభిప్రాయార్థము నాకీయఁగా వ్యవధిచాలమి నటునటుఁ జదివి చూచితిని.

పాతివ్రత్యమును మన పూర్వులు అతిశయోక్తిదోషభీతిలేక తమ చిత్తము వచ్చినట్లగ్గించి యున్నారు. శేషగిరిరావుపంతులుగారు సంప్రదాయ గౌరవము విశేషముగాఁ గలవారైనను, పూర్వులు కొందఱు స్త్రీల కిచ్చిన స్థానమును, పురుషాధిక్యస్థాపనోపాయములను, రచ్చకెక్కించి చర్చకు దింపినారు. నిజమైన పాతివ్రత్య మిట్లుండఁ దగునని కూడ తమ యాశయమును సూచించినారు.

నేఁటి చౌకరకపు గ్రంథములవలెఁగాక, దృశ్యకావ్యమైనను యీ గ్రంథములోఁ బలుచోట్ల చక్కనిధ్వని, సౌభాగ్యమును, వ్యంగ్యమును, ఉపమానసంపత్తియు, యితర చమత్కృతులును, గనఁబడి నప్పుడు యీ కవిగారి సారస్వతహృదయము తెల్లము కాకపోదు. మచ్చునకు కొన్ని ఘట్టములు: పుటలు, 1, 22, 24-25, 28, 34-35, 37, 82-85, 87, 88.

అంతేగాక యీ కవిగారు అనేక లోకోక్తులను విరివిగా నుపయోగించి నాటకమును రసవత్తరము చేసినారు.

చాలకాలముక్రిందట రచింపఁబడుటచేతను, ముద్రాది ప్రమాదము లెక్కువగుటచేతను, స్ఖాలిత్యములు చాల దొర్లినవి. మలికూర్పులో కవిగారు వానినెల్ల సవరించుకొందురని యాశింతును.

మధురస్వభావులును, సారస్వతాభిమానులునునైన శేషగిరిరావు పంతులుగారు ముందుముందు ఇంతకంటె రసవంతమైన, కాలోచితమైన యుద్గ్రంథములు రచించి దేశీయుల మన్ననలు పొందుదురుగాక.

ఆంధ్రక్రైస్తవకళాశాల,<br>
గుంటూరు.

ఎలవర్తి రోశయ్య, లెక్చరర్.

బ్రహ్మశ్రీ కొర్నెపాటి శేషగిరిరావుపంతులుగారి సముఖమునకు,

అర్యా! నమస్కారములు.

తాము అనుగ్రహముచే నాకు పంపిన మీ "అనసూయ" అను నాటకమును రెండుమూడు పర్యాయములు చదివితిని. మిగుల రసవంత మగను, ప్రదర్శనయోగ్యముగ నున్నది. పురాణములయందు, మహోత్తర ధర్మముగ, నాధ్యాత్మికసంబంధమున బోధింపబడిన పతివ్రతా ధర్మమును, నేటికాలపు సంస్కర్తల యభిప్రాయానుసారముగ ప్రదర్శించిన మీనాటకరచన మిగుల వర్ణనీయముగ నున్నది. పాతివ్రత్యమన భర్తలను భార్యలు, అంధప్రాయముగ అనుసరించుట కాదనియు, అభిప్రాయములను సమన్వయము గావించుకొని, ధర్మనిరతితో యావజ్జీవము దాంపత్యసౌఖ్యము ననుభవించుటయే పాతివ్రత్యమనియు మీరు నాటకమున ప్రపంచమునకు బోధించినారు.

మీభాషా ప్రావీణ్యమును గురించియు, మధురమగు సంభాషణనుగురించియు నన్ను మించిన పండితులే ప్రశంసింపగలరు. తాము వ్రాసిన యితర గ్రంథములును, ఖండకావ్యములును త్వరలో ప్రకటించుటకు వదాన్యులగు ఆంధ్రమహాజనులు మీకు సహాయ్యము గావింతురని యాసించుచున్నాను.

చిత్తగింపుడు.

విధేయుడు,

ఏ. సీతారామయ్య.

శ్రీ కొర్నెపాటి శేషగిరిరావు పంతులుగారికి

తమచే లిఖింపబడిన అనసూయనాటకమును దిలకించితిని.

ఈ కాలమున తమరిట్టి పురాణప్రసిద్ధమైన, సనాతనధర్మ విలసితమైన, యిక్కథను నాటకరూపమున లిఖించి, పాఠకలోకమున కంద జేసినందులకు మిక్కిలి సంతసించు చున్నాను.

ఇందలి పాత్రములన్నియు, యథోచితముగాను, నాట్యనాటక, కళా సంప్రదాయానుసారముగాను తుదివరకుఁ జక్కగా బోషింపబడినవి.

కథానుగుణ్యమైన ప్రాచీనధర్మ సంప్రదాయములను తదనుష్ఠాన పరులను, ఈకాలపు నిశిత విమర్శనలకు దగినటుల, సందర్భానుసారముగా యుక్తమగు పాత్రలచే, నిందాస్తుతిగ, వాదోపవాదముల జరిపించి; కథాసారాంశమగు సతీప్రభావమును చక్కగా జాటగలిగినారు.

ఇందలి ప్రతివిషయము భావరస, అర్థయుక్తములుగాను, సహేతుకములుగాను, పొందుపరుపబడినవి. రచనాభాగమందలి, విశేషభాగము, దేశీయ, సామాన్య, సరసపద, సమాసయుక్తముగాను, సహజసామాన్యోపమాన భరితముగాను, చిత్రింపఁబడినవి.

కవితాభాగమందంతటను నలంకారములు, రసములు, పూర్వకవుల సంప్రదాయానుసారముగ గర్భీకృతమై, తొణికసలాడుచున్నదనుట కెంతమాత్రము నతిశయోక్తి కానేరదు. మరియు పరుషవాక్కులు అనవసర పదములు- అయుక్తముగ పాత్రప్రవేశ నిష్క్రమణములు- ప్రత్యేక భాషాపటిమ జూపు కఠిన దీర్ఘ సమాసములు- ఇందెచ్చటను గనుపింపవు. వసంతాది వర్ణనలన్నియు ప్రకృతిసిద్ధములుగానున్నవి.

నా యీ మిత్రులు సర్వమానవ శ్రేయోదాయకమునైన నిట్టి కథాఘట్టములను రచించి, పాఠకలోకమున కర్పించి, ఆంధ్రభాషా యోషామతల్లి యాశీస్సులబడసి ధన్యులయ్యెదరుగాక.

ఇట్లు

నల్లూరు జగన్నాథాచార్యులు.

పుల్లడిగుంట

## ముఖ్య పాత్రములు.

### పురుషులు.

| | |
|---|---|
| బ్రహ్మ, విష్ణువు, మహేశ్వరుడు | త్రిమూర్తులు |
| నారదుఁడు— | దేవర్షి సంధానకర్త |
| అత్రి— | అనసూయభర్త (మహర్షి) |
| మన్మథుఁడు— | ప్రణయాధిదేవత |
| వసంతుఁడు— | మన్మథుని చెలికాఁడు |
| ఉద్దండుఁడు— | నర్మద భర్త |

### స్త్రీలు.

| | |
|---|---|
| అనసూయ— | కథానాయిక |
| గంగ— | జలాధిదేవత |
| లక్ష్మి, సరస్వతీ, గౌరీ— | త్రిమూర్తుల భార్యలు |
| నర్మద— | ఒక పతివ్రత |
| అనహంక్రియ— | అనసూయ చెలికత్తె |

సందర్భానుసారముగ మఱికొన్ని పాత్రలు వచ్చును

# సతీ అనసూయ

## నాందీ ప్రస్తావన

మ. వ్రతులై పత్న్యడి వారి సద్వ్రతము గర్వస్ఫూర్తి శక్తిత్రయా
న్వితదుష్ట క్రియలెంత తీవ్రతమమై విధ్వంస మొదింపదు
ర్మతి వర్తించిన పీటి బుచ్చ కెటులో రక్షించు నాతండ్రి కా
మితసంధాయకుఁడీశ్వరుండు కరుణన్ మిమ్మనశ్రాంతమున్.

సూ—(నాంద్యంతమున సూత్రధారుడు ప్రవేశించి పుష్పాంజలిం జల్లును.)

సూ—నటీ! ఒకసారి యిటురాఁగలవా?

నటి— ఆర్యపుత్రా! ఇదేవచ్చితి.

సూ—మహోన్నత పదస్థితులై మహాప్రభావ సంపన్నులై దిగంత యశోరమా కాంతులగువారును ననుకూల పతులుగాని యర్ధాంగులవలన ప్రణీతమగు దుష్టాంగముల వలన రోగులవలె బాధ నొందుచున్నారు, సామాన్యుఁడనయ్యును నీయట్టి యనుకూల వతియు, ధీమతియునగు భార్యలభించు నదృష్టము కలిమిఁ బరమ సౌఖ్యవంతుఁడనై నాకు నేనే గర్వించుచున్నాను. కాని స్త్రీజనసహజమగు నలంకారములపై మక్కువ నీకేల లేదు?

నటి—వినయానసూయా క్షమాంక్రియాది సద్గుణాలంకరణములవలెఁ గృత్రిమాలంకరణములంత రంజింపనోపునా?

గీ. ఎట్టియైశ్వర్య విలసితు లేనిగాని
యెట్టిప్రజ్ఞా విశారదు లేనిగాని
యొందు గుణమణి ననసూయ నెనయ రేని
ద్వేష విషవహ్ని దగ్ధులై విహ్వలింత్రు.

అనసూయాప్రభావ మిట్టిదని వచించినాతరమా. అనసూయ యన జ్ఞాపకము వచ్చినది. నేటిప్రదర్శనమున కదియే మాన్య తమమగు నాటకరాజము.

గీ. పాపసంపాత గంగ పావన మొనర్చు
నయవిరహితుఁడౌటఁ ద్రిమూర్తులైనఁ గాని
యర్భకులఁ జేసి జోకొట్టె నట్టి యాపె
మహిత గుణమణి యనసూయ మహిమ యరిది.

నటి— అగును పతివ్రతల చరిత్రములు మిగుల మనోహరములు. అమోఘ ప్రభావ యుతములు.

సూ— కాదా మఱి!

గీ॥ తనదు మాంగల్యమును నిల్పుకొనఁగనోర్తు
తరణి గతినాపి ప్రళయంబువఱకుఁ దెచ్చె
ప్రళయమును బాపి బ్రతికించెఁ బ్రజలనోర్తు
రూఢి ఘటనా ఘటన సమర్థులుగ సతులు.

నటి— సరేకానిండు. ఆనాటకమును రచియించిన కవియెవరు?

సూ— పేరుతోఁబనియేమి? గ్రంథము రసవంతమైన పేరదియేగాని తెచ్చును.

నటి— ఏమది! పేరుచెప్పుటకే సందేహించుచున్నారు.

సూ— అట్లు చెప్పుట ఆడంబరముగా భావించి యాతని నిషేధించుటఁ జేసి చెప్పకుంటిని. వేఱుగా భావింపకుము.

నటి— (కొంకు నభినయించుచు)

సూ— పాపములచే నాక్రమింపఁబడు గంగవలె నప్పుడే నీకింత కొంకు గలుగుచున్నదేమి?

నటి— రసగ్రహణ పారీణులగు నీసదస్యుల రంజింపఁజేయు చాకచక్యము నాయందు గలదాయని సందేహించుచు నిట్టి యసాధ్యకార్య భారమును మూపునఁ దాల్చుట కింతయుఁ గొంకుచున్నాను.

# స తీ అ న సూ య

## ప్ర థ మాం క ము.

### రంగము—1

(గంగను పాపములు వెన్నాడి తరుముచుండును. కంపిత శరీరముతోడను, వివర్ణ ముఖముతోడను, సంభ్రమమున పరువిడుచు గంగ ప్రవేశించును.)

పాపములు—పట్టుడు—కొట్టుడు—మట్టాడుడు—ఈకట్టిఁడి దురంతములు తపము మట్టింపుడు.

1 పాపము—ఇదే నా ప్రతిజ్ఞ వినుఁడు.

గీ. పొంగి పాఱెడి యురవడి క్రుంగఁ ద్రొక్కి
హద్దుమీఱిన సరసము లడఁచివైచి
సందడించెడి స్రోతలఁ జల్లఁబఱచి
తిప్పలంబడఁ జేయుదు దివిజ గంగ.

2 పాపము— నేను! నేను!

గీ. భువనముల క్రుంగు నానోటఁ బుక్కిలింతు
సెగడు క్రోధాగ్ని కీలల నిగురవైతు
పంకమునఁ ద్రొక్కి పాతాళ పథముఁ జేర్తు
సుడివడంజేసి యీ గంగసూడుఁ దీర్తు.

3 పాపము—

గీ. పట్టి చీల్తును నా కోర పండ్లతోడ
నల్ల లాడించి భంగింతు నట్టెయూపి
మలకలంబెట్టి యిక సదమద మొనర్తు
గర్భశత్రువు విడుతునే గంగనమ్మ.

గంగ—అమ్మరొయ్యో! నా పాపము ప్రొద్దలయినది. పాపముల పుణ్యము పైఁబడినది.

గీ. ఎప్పుడు దీపము పెద్దదా నెప్పుడు క్రమ్ము
కొందమాయని స్తంభముకూడఁ గూడఁ
దిరుగుచుండిన చీఁకట్ల తీరుగాను
పాపములు వెంబడించు నా పాటుకొఱకు.

నన్ను సంపూర్ణముగ రూపుమాపినఁ గాని తమ యభివృద్ధికి భంగము లేకుండ నుండదని నరకములు బిగించి కూడ పురాణి చేసినవి ఒకటినూ, రెండా, కోటాన కోట్లు. నేల యీనినట్లున్నవి. వానిని జూచుటతోడనే నా గుండె నీరగు చున్నది. కాలు నిలుచుట లేదు. నా యొడలు కంపమెత్తు చున్నది. వాని యాకారములు ఘోరతరములుగా నున్నవి. ఆ మిడిగ్రుడ్లనుండి విస్ఫులింగములు రాలుచున్నవి. ఆ మిట్టి మొగముల భ్రూయుగములు ముడివడుచున్నవి. ఆ కఱిబొగ్గు లకు గుదువులగు పెద్ద పెదవు లాగ్రహాతిశయమున దడదడఁ గొట్టుకొనుచున్నవి వాని దేహములను స్పృశింపకయే కంబళి పురువులకంటె నెక్కువ కంపము కలిగించుచున్నవి. వాని సింహనాదములు గండుబిల్లుల గొంగ్రుకంటె భయంకరముగా నుండి కర్ణపుటముల భేదించుకొని పోవుచున్నవి. వాని దేహము వందలి దుర్వాసనలకుఁ గుక్క పొగాకు కంపుకంటె నెక్కువగా ముక్కులోని వెంట్రుకలు కమురుకొని పోవుచున్నవి. అవి యొనర్చు వికారముల వలనను, ఆ దుర్వాసనల వలనను నాకు వాంతులుబుట్టి కడుపులోని ప్రేవులతోఁగూడ వెడలఁబోసి కొనునట్లుగా నున్నది. ఇట్టి యవస్థ నా కొక్కనాటిదిగాదు. దినములుగావు. మాసములుగావు. ఏండ్లతరబడిగా నిట్లల్లాడుచు న్నాను. ఇఁక నెన్నాళ్లు పొగులవలయునో దైవ మెఱుఁగును. అభ్యాసమునఁ గష్టములు సుఖప్రాయములగు నందురు నాపట్ల

భాగీరథీ" అని బట్టవలెఁ బ్రస్తుతించి, యెంతకుఁ దెగఁబడి యే రెండుతులముల మట్టియలనో, యే మొలచుట్టుఁ దిరుగని పోగు పొట్లకాయంత వెడల్పుఁగల జల్లితసిరిబు గుడ్డయో, యే మురికి చేలయో, యే గోరెడు కుంకుమ పసుపునో, పస దనముగ నిచ్చి ప్రబల పాతక్కుంజములు నాయందు నివర్తించి దరిఁజేరిన ప్రజలెవ్వరు నా కడ్డుపడుదురా! పట్టిది! పట్టిది! బలవద్వైరముఁ దెచ్చుకొంటి. ఈ పాతకము నన్నిఁక నిలువ నీయదు ముందు తెలవేమి? అగోచరముగ నున్నదే. నన్ను రక్షించు పుణ్యాత్ము లెవరున్నారు?

[తెరలో] ఆకాశవాణి

అమ్మా! నీ తపము ఫలించినది. నీ కష్టములు గట్టెక్కినవి. కొండలవలె క్రమ్ముకొనిన నీ యాపదలు మంచువలె విరియ నున్నవి. ఒక మహా పతివ్రతవలన నీ బాధ నివారణ కాగలదు. ఆమెను నీవే వెదకుకొనవలసియున్నది. ఇంతకంటె నెక్కువ వచించుటకు మా కనుజ్ఞ లేదు. పొమ్ము. ఆ మానినీ శిరోమణిని వెదకుకొనుము. గంగ—(వినుట నభినయించును)

గంగ—(వికాసముఖముతో) ధన్యోస్మి! ధన్యోస్మి! ఆకాశవాణి యేమి చెప్పినది. మహాపతివ్రతవలన నా బాధ నివారణ మగుననియూ, ఆమె యెవరో చెప్పలేదు. ఎవరనుకొందును. పతివ్రతయని యెట్లెఱుఁగవచ్చును. వారికేమి కొమ్ములుండునా. గొరిజ లుండునా. లేక మేము పతివ్రతలమని చెప్పుకొందురా. అట్లు చెప్పుకొనువారు కానేకారు. అయిన నెవ్వరు నొప్పుకొనరు. లోకమున లేనివారే యున్నట్లు నటింతురు.

ఆ. వె. కనులు లేనివారె గాజుకనులు వాల్చి
కన్నులున్నవారి కరణి మెలఁగు
చుందు, రట్టివారికో, విశాలాక్షి ప
ద్మాక్షి యనెడి పేరు లలరుఁగాదె.

కలిగినవారున్నట్లు కనఁబడనే కనఁబడరు. నిజమైన పతివ్రత

## ప్రథమాంకము

### రంగము — ౨

గంగ—(గంగ గౌరిని సమీపించి) అక్కా! నమస్కారము.

గౌరి—ఓహో! గంగ యెప్పుడో వైకుంఠమును పావనము చేసినదే!

గంగ—(తనలో) పాప పంకమునఁ జిక్కి వదిలినది యెగతాళి గాఁబోలు
(ప్రకాశముగా) అక్కగారంతకుముందే విజయము చేసి మంగళ
ము గావించితిరి గదా!

గౌరి—సాపత్న్యదోషము మాట సరసముగా రానీయదు గదా.
(ప్రకాశముగా) చెల్లెలా నీవునాకంటె ముందే వచ్చి యుందువని
యెంచి పిలువకయే వచ్చితిని. ఐనను మనబోటివారిని ఏమో
తప్పక పిలుచుటయే గాని, కలవారి కన్నులకు మనమాగి
యుందుమా, వచ్చుటయే పోక బాటుసుమా వారియాహంకారము
లేమో వారివైభవములేమో మనశక్తి వారికిఁబట్టునా
తోఁచి తోఁచనమ్మ తోడికోడలి పుట్టినింటికిఁ బోయినట్లు వచ్చి
తిని కాని నీకు లేఖ యెప్పుడందినది.

గంగ—నేనేమియు నెరుఁగను మీయింటివద్దఁదెలుసుకొంటిని. బావ
గారేరీ? (సస్మితయై) జుట్టు విడిపోయినారేమి. (తనలో) పతి
వ్రతలలో మొదటి పద్దే పతి నడబాయుటయా. బాగుబాగు.

గౌరి—ఏమో కలవుకాలములో నెక్కడకో నెక్కడకుఁ బోకున్న నిల్లు
గడచుట యెట్లు. ఎక్కడనో సహస్ర ఘటాభిషేకములంట. లక్ష
పత్రిపూజలంట. ఆహ్వానము చేయఁగా నేగినారు. రోజులు గడపు
కొనుటకు నేనిటకు వచ్చితిని.

గంగ—ఏమమ్మా? అన్నపూర్ణా దేవివి, నీకేమమ్మా! అంతబీద
పలుకులు పలుకుచున్నావు. ఇటువంటి వారేనా మిమ్ముల నీవఁ
గలవారు, మీరిద్దరు లేకున్న మీసంసార వ్యయము కొరత
నడునా. అంతు దరిలేని సంసారము. నీలో పీరెన్నవ వంతమ్మా

(తనలో) మగనికే యత్తయపాత్రగాని మనకేమి! (ప్రకాశముగా) మనపెద్దపిల్లవాని కంచము క్రిందరాలిన మెతుకులన్ని లేవు వీరి యింటిలోని వంటపెట్టు ముమ్మూరు గుణించినను.

గౌరి — ఆఁ! ఏమో! మాట మర్యాదలేని తావునకువచ్చుటయే బుద్ధి లోపము పసిబిడ్డకుఁ బట్టెడన్నమునకు మొగమొగాలు చూచుకుందురు. ఏమో వీరి సిరియెత్తిపోవుచున్నదఁట. ఏపూటనన్నము చాలలేదనియో, అడిగితక్కువయనియో, యిడితక్కువయనియో మనపెద్దపిల్లవాఁడు గునియుచుండుటయేగదా అంతకులోపించెడి వారు కలుపక పోయిన నెవరేమున్నారు. కూటికి లేకవచ్చితిమా గుడ్డకు లేక వచ్చితిమా.

గంగ — (తనలో) మనపిల్లవాని భోజనము బహుముప్పితములే. (ప్రకాశముగా) అక్కా! ఇలాగు మనవలె తలపిరియుఁ బోసికొని చేయి జాడించు నెడల భాగ్య మెట్లు నిలుచును. ప్రాఁచి నోటి వారికిఁ గాని భాగ్యము కూడదనుట నెఱుఁగవా?

గౌరి — నీవు పిలుపు తలఁపు లేకవచ్చుట నాకేమియు బాగుగ లేదు. నాపుట్టినింటికి నేనువచ్చిన దీనిపుట్టి యేమిమునిఁగె, సహించలేక అక్కగారి ట్లన్నదని యనుకొనఁబోయెద వేమో, పుట్టినింటివారయిననేమి, మఱియెవ్వరైననేమి. మనమర్యాదను నిలుపుకొనిననే మనలను మర్యాద చేయునది. ఎంత పొరపాటు పని చేసితివి!

గంగ — (తనలో) స్వానుభవమునుబట్టి చెప్పుమాటలు విశ్వసింపవలసినదే (ప్రకాశముగా) అక్కా! నీవాక్కులు నిజముగాని నేను వీరివిందులకును, విభవములకును రాలేదు (చెవిలో రహస్యముగా నేదియో చెప్పును )
(ప్రకాశముగా) నీకొఱకే: ఇందులకే సుమా.

గౌరి — (మనస్సులోఁ గొంచము యోచించుకొని) అందుకు నేనుసమర్థురాలనని సార్థకనామ మయిన సతీమణియే చెప్పుచున్నది. ఆ తయిని నామహిమ మూఁడులోకములకు విదితముగదా! అయిన

నాకంటె. లక్ష్మీఁదానుగూడ మహాపతివ్రతనని ప్రబలగర్వము. ఇక్కడేమనునో కనుఁగొందము రమ్ము.

గంగ—(పొత్రపుఁదనలో) అనుకొన్నంత యైనది. పోకతప్పదు లేదుగదా వచ్చెడి నిష్ఠురములు రానిమ్ము. ఓపిఁబట్టితి

(నిష్క్రమింతురు)

ప్రథమాంకము

రంగము ౩

(తెరయెత్తఁగాఁ లక్ష్మి పార్వతి గంగ ముగ్గురు నుందురు.)

లక్ష్మి—(గంగదిక్కై) అమ్మా! వచ్చినావటే తల్లీ! ఇంటికైన యీడుబిడ్డ లేకపోవ నెందఱో లేనట్లుగా చిన్నబోయియున్నది. ఇల్లేమి! పట్టణమే కళదగ్గియున్నది. నీవు వేయిమంది పెట్టు. నీవు లేకున్న నందడి లేదు. చప్పుడు లేదు.

(గౌరిదిక్కై) మాయమ్మాయి రాగానే చూడు మాకాపుర మీతల ప్రోతలతో నున్నది. (గంగ దిక్కై)

గీ. అమ్మ! మాకంటె నీకు మాయమ్మ కన్న
మిక్కిలి యుదాప్తవాఁడెది నిక్కువంబు
ప్రీతి ప్రేముఁడఁ బట్టక పిలువఁగాను
వచ్చినావటె మోదంబు హెచ్చెనాకు.

గంగ—అయ్యో! రావలసి వచ్చితినేగాని నాకే పిలుపు నందలేదు.

లక్ష్మి—(తనలో) అగునమ్మా! నీకంతంత మాత్రమునకు వినిపించునా, నీయొగిరి పాటులేమో! నీ పరుగులేమో! నీ ఘోషయేమో! నీవేమో! వెనుక చూపున్నదా! (ప్రకాశముగా)

గీ. పట్టి పిలుపులు నీ చెవి కెట్టు లెక్కు
పంత పలయునే యూర్మికా ప్రతతియేని
అంటెనని యాగ్రహం పడకమ్మ తల్లి
యున్నమాటకు నులేకల యొప్పుకొనుము.

గంగ—(తనలో) అబ్బా! ఈమె మాటలు నాచెవులకు శూలపుఁ బోటులుగదా. ఈమె నాలుక తేనెపూసిన కత్తి. అతిమధురమైన వాక్యములో నతి తీవ్రమైన ధ్వని యున్నది. అన్నప్పుడన్నఁ బెట్టినట్లైన నున్నదా యనుకొన్న నవియు నున్నగదా.

గీ. పలుకఁబడియెల్ల మాయమ్మ పలుకఁబడియె
పెట్టుబడియందె కొంచము పీకలాట
చేయి వెనుకకు గుంజుట చేయఁగలుగు
నన్ను బగిడిఁ జెలంగు నీయమ్మ సరణి

గీ. అట్టి మాటలను ద్వంద్వార్థమై మనంబు
నాటియఁ జేయును నగము నే నిందుకొలకి
పుట్టినింటి వైభవమునకై సుఖము లిప్పు
కేరయుచుండిన దప్పకన కేగుదాన.

(ప్రకాశముగా) అమ్మా! యిటురమ్మా (సమీపించి రహస్యముగా లక్ష్మి చెవిలో నేమియో యూదును.)

లక్ష్మి—(కొంతవడి యోచనా పరవశయై) ఈ భాగ్యమున కింత ప్రాధేయపడవలసిన పనియేమి. ఆడువారి యిబ్బందు లాడువారుగాక మఱి యెవ్వరు దీర్పఁగలరు. అందుచే నీవు నాకుఁ గూతురవుగదా. నాకు నీకన్న నెక్కువ వారెవరున్నారు.

గీ. వినవె గంగమ్మకూతురా! విస్తరించి
చెప్పఁ బనిలేదు తెలిసె వచ్చిన కతంబు

(గారవంక సగర్వముగాఁ జూచుచు)

అగుడు మానాటి కేమి పోయైన నిపుడు
ప్రాతవడె మా నభీష్టము పనికిరాదు.

కాలము మారిపోయినది. ఇదివఱకు కాలముగాదు. ఇప్పుడు మాకట్లు బొట్లు మెచ్చరు. మాది యేమున్నది. మేము మూలఁ బడినారము. మేమనిన మేమని కట్టుకారిప్పుడు విచ్చలవిడిగా

గొడవ పట్టినదా. శుద్ధ వైదికుడు. ఆ సామగానము లేమో పట్టుబడ లేమో. ఆ స్నానములు - సంధ్యలు - జపములు తపములు - నిష్ఠలు - నిర్మాల్యములు - తప్ప వేఱొకజోలి పట్టడు. ఇల్లు - వాకిలి - సంచి - కొడ్డ లేదు. ఇది యున్నది ఇది లేదనుకొనడు. తల్లికిఁ దండ్రికి మృష్టాహారములు - తనకుఁ తులసిపేరులు, వారికి పట్టుబట్టలు తనకు జేగురుబట్టలు - వారి కమృతాన్నములు తనకు నిరాహారములు. ఎక్కడఁగూరుచున్న నక్కడనే. అమిత సౌందర్యము. ఇదియేమి యన్యాయమని తండ్రి నడుగడు. ఎదిగి చేతికై యిల్లుకిద్దగల బిడ్డకు నేమియు లేదు. ఎక్కడలేని యలంకారములు పూజా పురస్కారములు వృద్ధ దంపతులకు. ఇఁక నా కొడుకునకు పెండ్లి పేరంటములు లేవు. తంబుర బుజానఁ బెట్టుకొని, చంకను జోలెఁ దగిలించుకొని, తాతచేసిన సన్యాసినని తాత పేరు పాడుకొనుచుఁ దాళము వేసికొనుచు, దేశమ్మకాకియై తిరుగుచున్నాఁడు. ఇట్టివారికి నగలు నాణెములు రిమ్మన్న నెచ్చటనుండి వచ్చును. అది యెవరికో పెట్టి పుట్టినవారికేఁగాని యెల్లరకు లభించునా.

గంగ—అగునమ్మా! తండ్రిగాని, తాతగానీ! ఈ రోజులలో తెలివి లోపమువారిని గనుఁజూడరమ్మా! పోనిమ్మ సొమ్ములు సొదలు లేకున్నమాన, భాషాసేవయైన బాగుగఁ జరుగుచున్నదా?

సర—అదియు నంతగానే యున్నది. పూర్వపు మహాకవులు, కాళిదాసాది సంస్కృత కవులును, నన్నయభట్టారకాది యాంధ్రకవులును, నాకొడగూర్చిన నవరసస్ఫూర్తియు, హావభావ విలాససంపదయుఁ, బదచమత్కృతియు, నలంకారవైభవమును మితిలేదు. కాని యిప్పుడొక పడమటి గాంబరము బయలుదేరినది. ఈ పడమటిగాలికి నా హావభావ విలాసములు కొట్టుకొపోయినవి. నవరసస్ఫూర్తి యడుగంటినది. నానాలంకారములు నష్టమైనవి. పదచమత్కృతి పాడైనది. ఇప్పటివా

రలంకారములెందులకు లేనిపోనికష్టములనుచున్నారు. పొలము బాత్రలమ్మి తమ భార్యల కలంకారములు దిగవేయుచుండుట లేదా. నాకట్టిదిగాదా. గ్రామ్యభాష గ్రంథములలోనికి బనికి రాదా యనుచున్నారు. సాత్వికముగ మాటలాడుటయు, బండమాటలాడుటయు నొకటియేనా. ఇట్టిమార్పులు చేసి నన్ను ముకలు చీలచుచున్నారు.

గంగ—అదృష్టము లేనిది యనుభవమునకు రాదు. నాముట్టుకున్న జూడరాదు. పుట్టినింటివారు శ్రీమంతులు మెట్టినింటివారిది యంతకు దరిలేని మహాసముద్రమువంటి సంసారమే యేమిలాభము పెట్టిపుట్టినవారు పైడిగట్టుకట్టినను పాటిదిబ్బయేయగును.

(నారదుండు ప్రవేశించును)

నర—(గంగతో కైక) అదుగో! మా నాయన వచ్చుచున్నాండు నిత్యేవ రాయుండు. ఒక్కండున్నను నాకును (నారదునితో) ఏమిచేసి వచ్చితివి నాయనా? నీకుం గాలిశని పూర్తిగానున్నది. నీకేమి కూటికివచ్చునా? గుడ్డకువచ్చునా? లేనిపోనితగవుల నెత్తినం బెట్టుకొని యొడలికిలేని యాయాసమునేలం బొందెదవు. పెండ్లి పేరంటములు లేకపోయినం బదుకుటకి మంచివాండవై తలలో నాలుకగా మెలంగి ఫలానివారి బిడ్డయనిపించుకొనక లేనిపోని వాడికి తలపడెదవు. కద్దికూడగునా నాయనా మాటవినినన్ను సంతోషపెట్టుము. ఇంత తెలిసినవాండవు, ఇంతభక్తిశ్రద్ధలుగల వాడవు. తల్లిని దుఃఖపెట్టరాదనుట యీమాత్రము నెఱుగకున్నావా?

నార—(తనలో) ఈపాట మాయమ్మకు రోకంటి పాటయే. నాబోటివారు లేకున్న లోకవ్యవహారములలోం జవిసార ముండునా? ఇందలి యానంద మొరుల కేమి తెలియును. తలలు మార్చుట సామాన్యమా, ఎంతయోచన ముండవలయును. దీనివలన మేధస్సెంత వృద్ధియగునో, ఎంత సమయోచిత వాక్చ

వాక్చమత్కృతి కలుగునో యీమె కేమి యెఱుక. అనుభవము నాకుఁ దెలియవలయును గాని యొరుల కగ్రాహ్యము

గంగ—అల్లుఁడా! మేనల్లుఁడా! తాతగారింట ఫలాహారపు కొట్టు తాళపుఁజెవి నీకే గాఁబోలు నిచ్చినది.

నార—అట్లు పెత్తనము చేయుట కన్నప్పుడెల్ల వత్తును.

గీ. డోలుపై దెబ్బ వేసిన మ్రోలుట కిటు
నంత తీరిక యేరికో అత్తగారు
కలుగు వారింటఁ బెండ్లిపై గడియ గడియ
కొకటి యగుచుండు వారల కొకటి తలుగె.

గంగ—మరి యేలవచ్చితివి?

నార—మరి నీవేల వచ్చితివి?

గంగ—పేర్చి బ్రహ్మాదికంబులకెల్లఁ దెలిసిన నారదుండనెదరు. నీకుఁ దెలియని దొకటి యున్నదా. ఎగతాళి కట్టుచున్నావు.

నార—ఎఱిఁగి యుండియు నడుగుదునా. అత్తా! పెద్దదానవు నీతోఁ బరియాచక మాడవత్తునా.

గంగ—ఒట్టు పెట్టు కొనుము.

నార—నీతోడు. అత్తా! అబద్ధమాడుదునా. అట్లు తెలిసి యుండియు నడుగుట మానవుల లక్షణముగాని నాపని గాదు అప్పుడే యింటిలో నడుగుపెట్టు చుట్టమును జూచి, "ఎప్పుడు వచ్చితిరి?" అందరు ఎక్కడనుండి వచ్చినదియు నెఱిఁగి యుండియే, "ఎచటనుండి రాక?" అని యడుగుదురు. క్షేమముగా నెదురు పడిన మిత్రునిఁజూచి కీడుశంకించుచు బాగుగా నున్నారా?" అనిప్రశ్నింతురు. అట్టివి మన సంగతులుగావు.

గంగ—అటులైన వినుమా (చెవిలో నేమో చెప్పును)

నార—(వికాస ముఖముతో) ఓహో! సరియే నాకు గజ్జకట్టి యాడవలసిన యవసరము వచ్చినదే.

గౌరి—తీగలేని తంత్రీవార్తగాఁడవు నీకుఁదెలియని దొకటియున్నదా

నార—గంగమ్మత్తయున్నట్లే మీ రనుచున్నారా అయ్యో! రామ
రామ! నేనేపాపము నెరుఁగను. ఇప్పుడే చెవినిఁబడినది.

గౌరి—దీని కేమనెదవు?

నార—మీరు ముగ్గురమ్మ లీపనికిఁ బూనవలదనియెదను.

గౌరి—ఏమి! మా పాతివ్రత్యమునకు లోటుఁ గల్పించుచున్నావా?

నార—మీరు పతివ్రతలేమైనను, కాకున్నను నీకార్యము మీవలనఁ
గానేరదు.

గౌరి—ఆఁఆఁ! ఏమి! అట్లనియెదవు. బెల్లము వండినపొయ్యి ఎఱుఁగవా?

లక్ష్మి—ఇంగువ గట్టిన గుడ్డ వాసన నెన్నటికైన విడుచునా?

సర—అబ్బాయీ! పెట్టినది పేరు. అందె వేసిన చేతిని యవలద్రోసితివా?

నార—(తనలో) వృద్ధనారీ పతివ్రతా (నవ్వుకొనుచు) ఇవియన్నియు
నేనెరిగినవే. అమ్మపుట్టిల్లు మేనమామ యొద్దపొగడవలయునా.
వీరి పాతివ్రత్యము కాచి వడపోసినదియే. డాంబికములతోఁ
గార్యములు గాఁబోవు. (ప్రకాశముగా) మీరు ముగురమ్మలు
పెద్దమ్మలు. మీయాన మీవలన నీకార్యము కానేరదు.
దయయుంచి మీరీపనిని మానుకొనుఁడు చిన్నవాఁడనో పెద్ద
వాడనో చెప్పుచున్నాను. మీరు మహాపతివ్రతలు కారని-కాదు.

గౌరి—మావలనఁగానిది మఱెవరి వలన నగును?

లక్ష్మి—వజ్రమువలనఁదెగనిది మఱిదేనఁదెగును?

సర—మాపై వైరమున మఱి పుట్టిరావలయును. ఇప్పటికి లేదు ముందు
సంగతియేమో. పునస్సృష్టిలో.

నార—ఆయమ్మ పుట్టియేయున్నది.

లక్ష్మి—ఏలోకమున. పదునైదవ లోకముననా?

నార—ముల్లోకములకు మధ్యవర్తియగు లోకముననే.

సర—ఏమి? మర్త్యలోకముననే. ఎవరంత మానవతి?

నార—మీవలె మిద్దెలలో మేడలలో లేదు.

లక్ష్మి—అంత కూరలు మేసి, నారలుగట్టి, యతవ్రులఁబట్టిన మానినీ శిరోమణి యెవరు?

నార—(తనలో) మీవలె విఱ్ఱవీగక (ప్రకాశముగా) తూండ్లు దుంపలు కూడుగాఁ గానలం జిక్కియు సార్థక నామయగు అనసూయ అత్రిమహాముని భార్య యెఱుఁగరా?

ముగ్గురు—(నిరసన భావముతో నవ్వుకొని) ఆహా! తెలిసినది. రామాయణమున వచ్చిన అనసూయయేనా? సీతకు మెఱుఁగు బిళ్లలు చేసి యిచ్చిన యామెయేనా?

నార—ఆమె నత్తరువుల బొమ్మగా నెంచుచున్నారా? సామాన్యురాలు గాదు. సీతాదేవికి -

గీ. వయసు మరలక తలపూవు వాడకుండ
దీవన లొసంగినట్టి సతీమణిం గ
రుణము మెయి కాత్మసాంధః కరణము పేరి
కడియమొసఁగిన యనసూయఁ గాంచరోటు.

సర—ఆహా! అంతలావు ఇల్లాలుగా! కానీ, యెవ్వరైన మాకేమి.

ఆ. మట్టిపిల్లి యేని ప్రమాణిపిల్లేనియు
నెలుకఁ బట్ట నేర్చె నేనిఁ జాలు
మానవాంగనేని మతి యెవ్వరేనియు
గంగచిక్కుఁ దీర్పఁ గలుగఁ జాలు.

గంగ—(తనలో) ఎవరెట్లయిన నాకేమి. నాకు సందువొరికినది. నా తెలివుఁ జూచుకొందుఁగాక. ఇక మీరు నారదుని సాధింపుడు. పట్టి పల్లార్పుడు (ప్రకాశముగా) అమ్మలారా! నాకిక సెలవా?

గౌరి—అమ్మా! ఎట్లయిననేమి మా పాతివ్రత్యము పరీక్షింప వచ్చితివి గదా.

గంగ—అక్కా! అట్లనఁదగునా? మిమ్ములనేమి! నేనేమి! పరీక్షించుట యేమి! ఆకాశవాణి లేదా.

లక్ష్మి—అందుకుఁ గాదటే అప్సరసఁ జేసి తెప్పించుటకు.

గంగ—(తనలో) పట్టియున్న కొనుకు వెఱితిక్కులు పోవేవి. మీపోలి నాకేమి (ప్రకాశముగా) చెల్లెకి వచ్చిన కీడు తప్పదికాదా ఆగడ్డ యాకేమి లోపదె ననఁగా!

సర—(తనలో)

గీ. పుడమి శ్రేష్ఠులు తమ్మును బోలె నెల్ల
వారలును భర్తను జెడ వలయునంచు
తలపు సేయుచుఁ బైకేమి దెలియనీక
గంగ తన్నాగ మెట్టిదిగాఁగఁదోచె

గీ. విభవముఁగని వందనము సేయఁ బ్రీతిమీయుని
నన్నుఁ బోలి పుట్టము తల్లియున్న దగిది
పతితయును గంగఁగని జాలికడిన మనస్సు
పతిత లక్షించఁదలకొనెఁ బరమ సాధ్వి.

అది యట్లుండ నీకు వంశమేది? ఇఁకనట్రగతి గాక యీమాకు మంచినడత యెట్లుగలుగును? (ప్రకాశముగా) మంచిది. పోయివత్తు.

(గంగ నిష్క్రమించును)

సర—

గీ. పోవు నంతను వెనుకచూపు నుత్కంఠించి
యెగిరి పడుచును ముందున కేగదంగి
కలుష భుజగముల ట్లు వక్రగతులైన
ప్రాపి నులకు మంచినడత యబ్బునెట్లు.

(తెరపడును)

ప్ర థ మాం క ము

రం గ ము 4

(తెరయెత్తగా నారదుఁడును సర్వాలంకార శోభితుండగు విష్ణువును కనుపింతురు.

నార—తాతా! నమస్కారము.

విష్ణు—దీర్ఘాయుష్మాన్భవ!

నార—తాతగారి కైశ్వర్యమును మాకు నాయుష్యమునా! ఎందులకు దరిద్రముచే బాధపడుచుఁ జచ్చిన చావును బ్రతికిన బ్రతుకును గాక దురపిల్లు చుండుటకా.

విష్ణు—అదికాదోయ్ నారదా! నాకుండిన నొకటియు, నీకుండిన నొకటియునా; నే నెవరు! నీ వెవరు? మనకు భేదము లేదా. నీవెల్లప్పుడు నింటనేయుండి సంసారము నెత్తిన వైచుకొని యీదిన వలదంటినా! మీతండ్రికి లౌకికము లేదాయెను. నీవిల్లు పట్టించుకొని యింటి పట్టున నుండవాయెను. అందువలన నేఁగదా యింత వయస్సు వచ్చియు గృహభారమంతయు నెత్తిన వైచుకొని యీ సంసార సాగరములోఁ బడి యీదుచున్నాను. మీరంత మాత్రము నాచేతి కడ్డము వచ్చిన హాయిగ నీతాపత్రయము వదలి ముక్కుమూసికొని యే దిక్కునో కూరుచుండ కుందునా.

నార—తాతగారూ! ఏదో యనవలసి యట్లంటినిగాని, నాకా సంసార తాపత్రయ మొందులకండీ, మీపెద్ద తలకాయలుండఁబట్టియే నెచ్చటఁదిరిగి వచ్చినను నిర్విచారముగానున్నది. నాకింక గావలసిన దేమున్నది. తమపద సరసీరుహములు నాహృదయమున నెల్లప్పుడు నాటుకొను నట్లొనర్చిన నాకుఁజాలు, నాకదియే పదివేలు.

విష్ణు—నాయనా! నీవైరాగ్యమును, నీనిశ్చలభక్తియు నే నెఱుఁగనా నీవీ సంసార సౌఖ్యముల గోరితివని నేదలఁతునా. (తనలో) ఈ సన్యాసికిఁ బెత్తన మిచ్చిన నిఁక కొంపకుఁదెరపియే. ఏదోనేను కాబట్టి మాయలతోనో మంత్రములతోనో యీ సంసారము నింతవఱకు నెట్టుకొని వచ్చుచున్నాను. గాని, వీరివలన నగునా; నాఘటము దొలగిన నీయభాగ్యుల కేసిరి నిలుచునా?

కట్టెది! కట్టెది! నిలువఁబోదు. నిమిషము నిలువఁబోదు. ఛాందసుఁడును సన్యాసియు నొకచోఁ గూడిన వారికి సిరినిలుచునా?

నార—(పరికించి చూచి) తాతగారూ! తమయలంకార మీనాఁడు మిగుల మనోహరముగా నున్నది. ముదుసళ్లయ్యును పడుచారెండ్ల బాలకుని వలెనున్నారు. ఇందులో మనస్వంత మేమియు లేనట్లున్నదే. అన్నియు బహుమతి చేయఁబడిన వేనే. నెత్తికెక్కినది శ్రీరంగము వారి కిరీటము. మెడలోనిది కంచి వారి పచ్చలపతకము. భుజముల నాశ్రయించినవి తిరుపతివారి భుజకీర్తులు. ఇదియేమి చిత్రమో ఉన్నవారును, లేనివారును గూడ నున్నవారికే యీయవలయునా. అదిగాక తాతా! నీకేమి!

గీ. శ్రీ గళానికి నాలుగు చేతులేమి
యిరువదేగాదు ముప్పది యేనివ్రేళ్లు
మురుగులు ముఃడీగొలుసులు నరుదె, బొటన
వ్రేలు మొదలుగ కెంపు టుంగ్రాలు కలవె.
(విష్ణు ప్రత్యక్షుఁ డగును)

నార—

సీ. వినము కుత్తుకనిల్పి వెనఁజరించెడి సదా
శివు తలదాటివచ్చినది గంగ
పలునాలుకలుగల్గి భాషింపనేర్చిన
వనజజు నాల్కఁద్రొక్కినది వాణి
వేషధారణను బ్రహ్మణుఁడౌ శ్రీ విష్ణు
దేవుని రొమ్ముగ్రుద్దినది లక్ష్మి
మిత్తికి మిత్తియై మెలఁగెడి రుద్రుని
తనువు సగంబుచేసినది గౌరి
గీ. లోక నాయకులను మించు లోకమాత
లహహా! యీ సతీపతుల యత్యానుగుణ్య
మేటునకు నేటు దీటుకు దీటుగాక
నడచునేగతి యీ జగన్నాటకంబు.
(నారదుఁడు నిష్క్రమించును.)

# సతీ అనసూయ

## ద్వితీయాంకము.

### రంగము 1

స్థలము:—అత్రిమున్యాశ్రమ ప్రాంతారణ్యము.

(అనసూయ ప్రవేశము. పార్వతి, లక్ష్మి, సరస్వతులు పొదలమాటున దాగియుందురు.)

అన—అబ్బా! ఎండ యెంత తీక్ష్ణముగా నున్నది. పైన నెత్తి మలమల మాడుచున్నది. క్రింద కాళ్లుం బొబ్బలెక్కిపోవుచున్నవి. నిప్పులు సెలగుచు రేయిపవని యీ చెవిలోనవడ యీ చెవిలోనికి దూసికొని పోవుచున్నది. (సూర్యునివంక జూచుచు) నాతండ్రి సూర్యభగవానుఁడు నత్తగుల్లవలె నతి మందగతిం జరించు చున్నాఁడు.

సీ. కడలి నీరంబులు గడుపారఁ గ్రోలుటఁ
గాలుసాగని గుఱ్ఱాల్ గదలకుండ
నోరగాసాగెడి యొంటి చక్రపు బండి
గట్టు నిల్వగరాక నిలుచుచుండ
మిడిమిడి యొడలు నొడలు కొంపు వహింప
శ్రమచేత నరుణుడ శ్రద్ధనుండఁ
బోఁగలనా? లేన? పోవక తప్పదు
విధికృతంబని బయల్వెడలఁ దరణి

గీ. కడ యెఱుఁగరాని విషమ మార్గమును బట్టి
కడుఁ బ్రయాసను జనుచుండు కారణమున
దినములంతకు నంతకు దీర్ఘమగుచు
భీష్మ మైగ్రీష్మ మంతయు వేఁడి దోఁచెఁగా.

ఈ ప్రాంతమునందలి నీటి వసతియు లన్నియు నిగుడుకొని పోయినవి. చిన్న నీటిబొట్టు దొరకకున్నది.

గీ. పొంగి పొరలిపారుచు పొర్లిపోయి, వాగు
వెడలి దనాతులు తరుగులు వెట్టునదులు
సన్నగిలి బొబ్బరింతలు చల్లబడఁగ
దిప్పలంబడి యున్నగంటి యింకిపోఁడె.

పాత్రమునందలి నీరంతయు చిత్రముగా నిగుడుకొని పోయినది. ఇది యేమి మాయయో తెలియకున్నది. ఇంత నాచమనమునకైన నీరు లేకుండె. "ప్రాణాయామో ఆచమనం విధిః" అని యున్నది. నాకీనాఁడు కర్మలోపము గలుగును. ఎట్లైన జలంబులఁ దేవలయు. లేకున్నఁ బత్యాజ్ఞకు భిన్నముగా నడచి మదీయ వ్రతలోప మొనర్చికొనినదాన నగుదు. ఇప్పుడు నాకొఱకై యిచ్చట దాపున నెచ్చటను లేని జల ప్రవాహము లెట్లు వచ్చును? చేరువ బుషి పటీరమున కేగియైన నడిగి తెత్తునా?

(అని యనుకొనుచు నీటికై వెదకుచుండును.)

గౌరి—ఎండకును గాలికే భయపడు పతివ్రత యేమి సేయఁగలదు. పనిపడిన నగ్గిలో నుఱుకుమన్నను నుఱుకవలయును. అప్పుడే పత్యాజ్ఞోల్లంఘనమునకుఁ ద్రోవఁ జూచుకొనుచున్నది. ఈమె శ్రమయంతయుఁ జేసు ప్రశస్తులకేగాని త్రికరణశుద్ధిగా నాచరించు స్వధర్మముగాదు. అట్లొనర్చునది యొకట ఛాయయే గాని యన్యులుగారు. చూడు.

సీ. తీక్ష్ణకరస్ఫూర్తిఁ దేరిజూడఁగరాక
భగ్గున వెలుఁగుచుఁ బ్రజ్వలింప
పంకేరుహాంగనా ప్రతతికిఁ బ్రియుఁడునై
యెదుటనే వారి స్పృశించుచుండఁ
బుడమిపైఁ దనుపీడి గడువశీథముపై
సత్పథంబును బట్టి చనుచునుండ

చున్నది. ఇట్టి యొయ్యారులందరు మహా పతివ్రత లగుచుండ నిఁక లోక మెటునిలుచును.

సర—ఉడుకఁబోవుచుఁ గూరాకువలె యేమనఁగను? అనసూయలో ఆమె పస బంగారువలె నున్నదిగదా. ఇంతలో మనకిన్ని సందేహము లేల.

(గంగ ప్రవేశించును.)

గౌరి—అదిగో! గంగ తానేవచ్చినది. ఇఁక వీరి ప్రసంగము విందము. (అనసూయ నీటికొరకై దొన లెందేని కలవేమోయని రాళ్లు రప్పలు కదలించుచు వెదకుచుండును. గంగ యామెను లక్షించును.)

అన—(సుఖము నభినయించుచు) ఆహా యేమి నా భాగ్యము. ఈ చల్లనిగాలి యెచటనుండి వచ్చుచున్నది. ఇది నీటిగాలివలె నున్నదే. ఎన్నడును లేని జలప్రవాహ మిట యెక్కడినుండి వచ్చినది. కడు వింతగానున్నదే.

గంగ—(తనలో) నే నీమెయెడ మహాపరాధ మొనర్చితిని. ఇంట నీరు లేకుండఁజేసి యీ మిట్ట మధ్యాహ్నమున మలమలమాడు నీ కొండరాళ్లలో నీమెను త్రిప్పి యాయాస పెట్టుచుంటిని. నా పాపమునకుఁ బరిహార మేదునా. ఇఁక నీమెకు నన్ను కౌఁగిలించుకొందును ఎవరికిని నాకౌఁగిలించుకొనుట యంత ప్రశస్తముగాదు. ఆయిన నిప్పుడు నా సంగతి నీమె కౌఁగిలించువారెవ్వరు? ఉభయుల నెఱిఁగినవాఁడు. నారదుఁ డుండిన బాగుండునది. (ఆలోచన నభినయించుచు) పొరబడు చుంటిని. నేనే దర్శించిన లోపము! అట్టి చిక్కులు ప్రభు స్థానములందును, లౌకికుల యెడలను గాని శుద్ధ సాత్విక ప్రకృతియు పరమ పతివ్రతా శిఖామణియు నగు అనసూయకడ నేల కలుగును? ఆమె నన్ను తప్పక గౌరవించితీరును. అదిగో! భవ్యాత్మురాలు ప్రమాణబిందె భుజముపై నుంచుకొని నీటి కొఱకు వెదకుచు రాళ్లు రప్పలు కదలించుచున్నది. ఈమెను

తర్పించుట కిదియే యుచితమగు సమయము. తీర్థమును స్వార్థ మును నెరవేరుము. ఆమెయు గంగ ప్రసాదించినట్లును, నా కర్మ విము క్తికి సాధనము నరసికొనినట్లును నగురు. (జల ప్రవా హాముతో గంగ వెడలివచ్చును.)

అన.—అమ్మా! చల్లని తల్లివి. యెచటనుండి వచ్చితివి? గంగను వెంటఁబెట్టుకొని వచ్చితివమ్మా! మా మునిపల్లెను పావన మొనర్చితివి. మమ్ము ధన్యులను గావించితివి. ఓమ్మగుంటు పై భాగీరథి పాఱినట్లు తల్లీ! మమ్ము కటాక్షింప వచ్చితివా?

గంగ.—గంగను వెంటబెట్టుకొని వచ్చుటయేమి? గంగ నే వచ్చితిని. మునాశ్రమమును పావనమొనర్చుటకని మీరాడినమాట యతిశయోక్తియమ్మా, మిమ్ము ధన్యుల నొనర్చుటకుఁ గాదు. మీ నిర్హేతుకజాయమాన కరుణాప్రవాహమున ధన్యురాల నగు టకే వచ్చియుంటిని.

అన.—(ఆనందపారవశ్యమున) అమ్మా! పరమ పావనివైన గంగా భవానివే! నాహృదయపూర్వక ప్రణామము నందుకొనుము. (అని నమస్కరించును.) అంతమాటాడితి రేమి? దివ్యమూర్తుల రైన మీకు మానవాంగనవలనఁ గాఁదగినదేమి?

గంగ.—తల్లీ! అట్లనకుము. సర్వము నారదునివలన నెఱిఁగియే వచ్చి తిని. నీ ప్రభావము భావనాతీతము. నీవలన నేను పావనము కావలయును. ఈ పాపములచే వెంబడింపఁబడి జోరీగల గొడ్డు వలె నెట్లల్లాడుచున్నానో చూడుము. ఈ పాపములు నా వినా శమును గోరుచున్నవి.

గీ. ఎపుడు దీపము పెద్దదా నెపుడు క్రమ్మె
కొంద మాయని స్తంభముకూడఁ గూడఁ
దిరుగుచుండిన చీఁకట్ల తీరుగాను
పాపములువేచియుండె నా పాటుకొరకు.

నాశ్రమ మేమని చెప్పుదును. ఈ పాపములను—

గీ. ఎఱుఁగనట్లుగ విముఖత నెట్టుచున్నఁ
గనులఁగట్టిన చందముగాఁగఁ దోఁచు
మఱపుఁ గొలుపఁగ నెంతగా మునుపడిన
నెరియు హృద్వేదనం బాగదేమి సేతు.

గీ. ఎంత దిటవుఁబఱుపఁ బూనిన నెదకరాక
మొగమున నదేమొ దైన్యము మొలకవాఱు
కొంకు జంకును నెమ్మన సంతరించుఁ
గను వివర్ణత గద్గదికయును దోఁచు.

ఆ. మిన్నువిఱిగి నెత్తిమీఁదఁ బడ్డట్టులు
విన్నఁదనము దోఁచ వెన్నుగ్రుంగు
కలవరంబు హెచ్చఁ గలుగు నెమ్మనమునఁ
గడుపులోనఁ జిల్లు చిటికినట్లు.

అన—(ఆశ్చర్యచకిత మానసయై)

సీ. విష్ణు పాదకమల విమల మకరందమై
జన్మమందిన యాంభోజాక్షు మహిమ
శివు జటాజూటాగ్రసీమను నమృతాంశు
తోడుపడఁగ నున్న దొడ్డయునికి
మూఁడు లోకంబుల మొఱసి పవిత్రత
బడయఁజేసిన నీ ప్రవర్తనంబు
వాహినీశ్వరు నైక్యభావంబుగని యందు
కలసి మెలసియున్న కాపురంబు

గీ. ఇంత యంతని వచియింప నేరితరము
నీల సత్త్వభావము వర్ణనీయ మహహా!
పతితులఁ బవిత్రుల నొనర్చు భవ్యమూర్తి
పరమ పావని గంగాభవాని తల్లి.

నీకును శాపములవలని బాధయా? ఇదియేమి పాపమమ్మా?

గౌరి—మతిచెడి మానవాంగన పాయము గోరినందులకు పడగవలసిన మాటలు రెండును పడినవి.

లక్ష్మి—పేనుకు పెద్దరికమిచ్చిన తలంత దెగఁ గొరికినదఁట. స్వల్ప బుద్ధులు తమకిచ్చిన గౌరవమును నిలుపుకొనఁ గలరా.

సర—ఇంతటనైన గంగకు బుద్ధివచ్చి వెనుకకు మఱలిన కొంత పరువు దక్కు—నేమో! ఆఁ! ఎందుకు మఱలును? ఆమె హృదయమున నారదుని మాటలు వేదవాక్కు—లుగా నాటుకొనినవి. శిలాక్షరములయి పోయినవి.

గంగ—నా ప్రభ సాగినంతవఱకు వల్లె సాగినది. గ్రహచక్రము తల క్రిందైనది. ననుఁ జూచిన భయవిహ్వలములై మారుమూలల డాగిన పాపపుంజములు నేడు విజృంభించి గర్జించుచున్నవి. తిరిగొని కయ్యమునకుఁ గాలుద్రవ్వుచున్నవి.

గీ. తొల్లిపెద్దల మేకల నెల్లలాగు
మేటికారున నిరికిన మేకలాగ
వేళకారవసరమైన తీరుగాను
పాపములఁబాపు గంగాయి పాపములను
బాగుగా నొందు వెరవు గావలెనమ్మ.

గౌరి—క్రిందఁబడినను మీఁదిదానవే యనుచున్నది. సిగ్గునఁ దలవంచు కొనక. భర్త తలకెక్కిన పాప మూఱకపోవునా. ఎంత చనవున్న భర్తమీఁద నింత యాగడమా. కట్టుకున్నవానితోనైనఁ గడతేరకుండ పెదవడఁగనే విడిపోయి, రత్నాకరునితో సంగమించుటయా. ఏమి యన్యాయము.

లక్ష్మి—అగును. పాపము. ఇంత యోగ్యురాలవు గనుకనే భర్తను పీల్చి పిప్పిజేసినది. మగతనము నగవఱచినది.

సర—అందు నామె దోషమేమి? ఆమె వాక్కుల నామె నిలుపుకొన్నది. ఆడువారిట్లు వెనుకముందాడుచుండుట వల్లనే మగవారు కన్నులు పైకెక్కి— ధర్మాధర్మములు గుర్తెఱుఁగక

మహాధర్మిణులఁ జులకఁబఱచి యనాదరించు చున్నారు. ఇట్టి వెలితిమాటలు మన మాడరాదు.

లక్ష్మి—(తనలో) దీనితో నేను మాటలాడలేను. నోరున్నదని కాని దాని కైనదానికిఁ బిలువని పేరంటమునకు వచ్చుచుండును. ఇందు తన జోక్యమేమున్నది. తానేలఁ గల్పించుకొని తన పాండిత్యము నెకరువెట్టవలసి వచ్చినది. ఇంటికిఁ బెద్దదానను. అత్తగారిననియైనఁ దలంచవలదా. తన బ్రతు కెంతవఱకు మాటలబండారమే గదా యని గుర్తెఱుఁగకున్నది. (ప్రకాశముగా) అగును. శక్తిమంతుల కేమి. ఎంతపనియైనఁ జేయఁగలరు.

సర—అబలల మనుకొనుటయే మనవలననైన గొప్ప పొరపాటు. (గౌరిదిక్కై) నిజమునకు నీశక్తి నీకుఁ దెలియదుగాని నీవు చేయలేనిది పౌరుషవంతులైన పురుషులు చేయగలిగినదియు నేమియుఁ గానరాదు. మహిషాసురసంహార మే పురుషుఁడు చేయఁగలిగినాఁడు. ఆప్పుడీ పురుషోత్తమోత్తము లందరు నేమయినారు.

అన—అక్కటా! శోచనీయము.

గంగ—ఈబాధ నీవలనఁగాని తొలఁగింపఁ బడదని నారదుని ముఖమున విని వచ్చుచుంటిని. నా మనవిఁ ద్రోసిపుచ్చక నంగీకరింపవలయును.

అన—అమ్మా! నేనంతటి సమర్థురాలనని నాకుఁ దోఁచదు. అయినను మీ యాశీర్వాదబలమునను, అమోఘ ప్రభావయుతంబగు నారద వచనమునను, నాపతి యనుగ్రహంబునను నొకవేళ నోఁచిన నోఁపుదునేమో. అట్లే చూతము. తాము మాత్రము దయచేసి మా కుటీరమును పావనమొనర్చి మఱిపొండు.

(గంగానసూయలు నిష్క్రమింతురు.)

గౌరి—నారదుని మాయావాగురులంబడి భ్రమించి మొఱఁగక గంగ వేడిన మాత్రమునఁ దగుదునని తా నంగీకరించినది. మాన

వాఁగన దోసం. అమర్త్యాంగనకు పావనమొనర్చుట యేమి! వెండికొండకుఁ జేరపోలను మెఱుఁగా. మాటలకును కార్యమునకును చాల దూరము.

గీ. నాకిదా కృత్రిమ సతీత్వ నటనమునకె
పాపఫలితము లిలఁ బటావంచలైన
వేశిస్త్రీలకుఁ గొంపలు గాలకున్న
కాలవే చింతకాయలు రాగములకు.

లక్ష్మి—అదిగో ఆశ్రమమునకుఁ బోయినారు. మన మా సమీప లతాకుడుంగముల దాగియుండి వారి సంభాషణమును విని పర్యవసానమును కన్నులారఁ జూచియే పోవుదము. తొందర యేల!

ద్వితీయాంకము

రంగము 2

స్థలము:—అత్రిమున్యాశ్రమము.

(గంగయును, నీళ్లబిందెతో ననసూయయుఁ బ్రవేశింతురు.)

(జింకపిల్ల పరువెత్తుకొనుచు వారి కెదురుగా వచ్చును.)

అన—అమ్మా! మా గృహములకు సింహద్వారములు మకరతోరణములు లేవు. మా గృహములు సారమే యరక్షితము లగుటకు మాకుఁ జోరభయము లేదు.

గీ. అతిథులను మచ్చికను జేరి, యాదరమున
నరసి కొని తెచ్చు మా ప్రతీహారియైన
మాకు ముఱిపెంబునకు బిడ్డ మారునైన
ఈ హరిణపోతమే దిలకింపుమమ్మ.

గంగ—(మచ్చటపడి దానిని దువ్వి ముద్దాడును.) ఆమ్మా! ఏమి! ఎఱుఁగనివారికిఁ జెప్పినట్లు చెప్పుచున్నావు.

గీ. ఘోర సింహప్రపాలిత దారుణాట
వులను, మకరాలయప్రాయములును, నీచ

శునక శుకపక్షిశిశువులౌను శుద్ధ సాత్త్వి
కాంతరంగ ప్రపూర్ణ మున్యాశ్రమములు.

తృణగర్భమగు నీకు రంగముకంటె మీ పాతివ్రత్య హృదయములకుఁ బ్రియ మొసఁగునది మఱి యేముందును.

అన.—మా కలభ్యములగు వైభవములపై వాంఛయును లేదు.

గీ. ధాన్యమునకైనఁ గలుగు కేదారములును
మాడుకారులు ఫలియించు మొగ్గలముగ
హవ్యకవ్యంబు లొదగూర్చ నంతపట్టు
నోపు నీహోమధేనువు ప్రాపకంబు.

గీ. వల్కలాజినములు మాకు వలసినన్ని
కూర్చుననటులు హరిణముల్ గొదువలేక
భోగ భాగ్యంబులకుఁ గాంక్షఁ బొంద, నవస
రంబు లేదుగా మీ యనుగ్రహము కలిమి.

అనహం.—(ఆశ్రమమునుండి అనహాంక్రియ పరుగునవచ్చి వికాసముఖముతో) అమ్మా! ఈచల్లనితల్లి యెవరమ్మా! ఈమె పాదములు మోపఁగనే మన యాశ్రమమున నిగిరిపోయిన పాత్రములందలి నీరంతయు మఱికి పొంగుచున్నది. (గంగదిక్కై) తల్లీ! ఈ వేసంగినల్ల యిచ్చటనేయుండి మా యొద్దనుఁ బాపలేవుగా?

అన.—లోకములకెల్ల నిత్య జీవనియగు తల్లిని, నిలిచి నీ యొక్కతె యెద్దఁడఁ బాపుమంటివా! కడమవారి గతియేమి? ఎంత స్వార్థపరతంత్రురాలవైతివి.

అనహం.—(ఆశ్రమముతో) ఆఁ! ఆఁ! ఏమి! త్రిలోకపావని గంగాభవానియా! ధన్యోస్మి! ధన్యోస్మి! తొల్లి భగీరథప్రయత్నమునఁ బుడమికివచ్చి భస్మరాసులపైఁ బారి సాగరులకు సద్గతులొసంగితివి. నేడత్రియత్నమున నత్రిమున్యాశ్రమము పావన మొనర్ప వచ్చితివా? అవ్యాజానురాగ ప్రభావము పక్షనాతీతము. తల్లీ వందనము. పాదములపై వ్రాలి నమస్కరించును)

(అందరు లోనికి నేగుదురు.)

(తెరయెత్తగా పర్ణశాలాంతర్భాగము కనుపించును).

అన—(గంగకు నుపచార మొనర్చును.

సీ. వైకుంఠ కైలాస వరసౌధములఁ గన్న త
ల్లిరో! మా యాకుటిల్లుఁగంటె
(కుటీరమును చూపును)
మణిఖచిత స్వర్ణమయ పీఠ సంస్థిత
యాసీన వగుము కుశాసనమున
(దర్భాసనము పరచును)
సురభూజ సుమహార మకుటార ధరించు
మాయమ్మ! యీపుష్పమాలఁగొనుము
(పూలదండను మెడలో వేయును)
మూడులోకములకుఁ గూడ జీవనమునా
జనని యర్ఘ్యంబు గైకొనుము నిత్తు
(అర్ఘ్యము నొసఁగును.)
గీ. రత్ననిలయము, నిగూఢాంత రంగ మొరిఁగి
కాపురముదిద్దు సద్గుణ కల్పవల్లి
తలిసి యిల్లాలి యతిథిసత్కార మింత
కరుణఁ జేకొని కృతకృత్యగా నొనర్చు.
(మధుక్షీరముల నొసంగును.)

గంగ—(అయిష్టతతో) అమ్మా! సన్నిపాతరోగికి శైత్యోపచారము లేల? నేవచ్చిన కార్యము జూచి పుణ్యము గట్టుకొనుము తల్లీ!

అనహం—(తనలో) ఏమి! ఈయమ్మ వచ్చిన కార్యమేమి? అమ్మ తల్లికి మానవమాత్రులతోఁ బనికలిగినదా? వచ్చినది గాఁబోలు మనపుణ్యవశమున.

అన—(దీర్ఘాలోచనపరురాలై ధ్యానము నటించి) ఇదిగో. స్థిరసంకల్ప నయితిని. నాభర్త్రనుజ్ఞ వడసి నాశక్తి వంచనలేక తమకార్యమునందే వర్తింతును. (అనహంక్రియదిక్కై) అమ్మా!

మహర్షి సత్తము నొక్కసారి లోకపావని యాగమనము నెరింగించి తోడితేఁగలవా?

అనహం—చిత్తము. అట్లే యొనర్తును. (అని వెళ్లును)

అన—అమ్మా! నేను సహధర్మిణిని గదా. ఇంద్రియములు శక్తిమంతములయ్యును బుద్ధి యనుమతి వడయక కార్యకరణమునకు దిగనట్లు నేనును భర్త్రనుజ్ఞ వడయక యేకార్యమును స్వతంత్రించి యొనర్పఁజాలను. అట్లని నే నస్వతంత్రురాలననియు నాభర్త నన్ను నడుపు కర్ణధారుఁడనియు భావింపకుము. మాహృదయము లట్టివిగావు. ఈసంసారము మాయిద్దఱిది. ఇరువురము స్వేచ్ఛాపరులమే, గాని యొకరికొకరము బానిసలముగాము. కాని యుభయులము మంతన మొనర్చక యథేచ్ఛముగా నే కార్యము నొనర్పము. గృహచ్ఛిద్రము లొడగూర్చుకొని మాజీవిత యాత్రకు నాటంకమును మాయానందమునకు విఘాతమును గల్పించుకొనక సర్వకాల సర్వావస్థల యందును నియమనిష్ఠితులమై యుందుము. అనగా ఒకమాటలో మా సంసారము—ఉమ్మడి వ్యవసాయము—ఉమ్మడి వ్యాపారము అట్లయ్యును భర్త్రాదేశమును నేను భగవదిచ్ఛగా భావింతును. ఆ యనఘుఁడు నన్ను ఆదేశించునో—ఉపదేశించునో—అభిలషించునో—యాచించునో తెలియరాదు. మఱి నాహృదయమునే గ్రహించి తద్విధానమునందుఁ బ్రవేశపెట్టునో నే నెఱుఁగ లేకున్నాను. పెక్కుమాటలేల? ఆమహాత్ముఁడు నాకు స్వధర్మోపదేష్టయై గురువుగాను, సన్మార్గ ప్రవర్తనను గావించి ప్రభువుగాను, నిత్యకృత్యములందు జేదోడు వాదోడునై చెలువుఁడుగాను విలసిల్లుచున్నాఁడు. తానెంత ప్రభావయుతుఁడయ్యును నాయాత్మస్వాతంత్ర్యమునకు భంగము వాటిల్లకుండఁ గంటికి రెప్పమాదిరిగఁ జూచుకొనుచుండుటయే యా మునిచంద్రునిపై నాహృదయము

యించుచు నద్వైతము సిద్ధింపఁ జేయుచున్నది. నేనెంత భర్తృచరణయుగళ ధ్యానాసక్తనో ఆమహాపురుషుఁడు నంత భార్యాభిమాన సంరక్షణానురక్తుఁడై యుండుట నేనెంతయు గర్వించవలసిన విషయము. ఇదియే మా దాంపత్యానుగుణ్యమునకు మూలకందము. నేను విశేష మేమియు లేదు. అమ్మహితు నాశ్రయణమున నేను పతివ్రతనగుట విశేషమేమి? సూర్యకిరణ ప్రసారమున వెలుగని పదార్థముండునా? ఋషిచంద్రముని చిరసాంగత్య ప్రభావమే యాతనియందు భక్తివిశ్వాసముల గల్పించినది. ఆతని యేకపత్నీవ్రత ప్రభావమే నాయందు ప్రతిఫలించి పాతివ్రత్యమని పించుకొనుచున్నది. అంతియేగాని యిది నా స్వయం ప్రకాశమనుట కెంతమాత్రమును వీలులేదు. నాపూర్వజన్మ పుణ్యమున నాకిట్టి పురుషుఁడు లభించుటచే నాకుఁ దరణోపాయము కలిగినది. లోకమునందెల్ల నిట్టియనుగుణ దాంపత్యమును ప్రసాదించుటకుఁగాను భగవంతునిఁ ద్రికరణశుద్ధిగాఁ బ్రార్థించుచున్నాను.

గంగ—అమ్మా! లోకమంతయు నిట్లేయున్న నిక మోక్షాసక్తులగుదురా? ఇంతకంటె సచ్చిదానంద మేమికలదు? కాని మానవులలో నిప్పుడు దాంపత్య విషయములందు చాలదుర్ణయములు జరుగుచున్నవి. కొన్నియెడలఁ బాతివ్రత్య మిషమునఁ బురుషులు స్త్రీలను వంచనచేసి పశువులకంటె హీనముగాఁ జూచుచు బానిసలనుండివలె వారివలనఁ బనులఁగొనుచు యంత్రములను గీలుకాండ్రవలె వారిని నడుపుచు స్వాభిమానులై స్వార్థపరులై తమ యాత్మజ్ఞానమును నశింపఁజేసి వారియెడలఁ బరమద్రోహులగుచున్నారు. స్త్రీలును విద్యావిహీనులై మౌఢ్య ప్రాబల్యమునఁ బురుషులను శక్తిస్వరూపిణులై [illegible] శాంతి[illegible]ండఁ బట్టి పల్లార్చి రాచి రంపమునఁబెట్టి [illegible] దంగ సీయక యుచ్ఛ్వాస నిశ్వాసము[illegible] కల హముల దీర్పులతోడనే [illegible]ంచు

చున్నారు. సదసద్వివేచనా శూన్యులయి, యుండిలేమిడులను, గార్హ్యకార్యములను, నెఱుఁగలేక ధనాదులను దుర్వినియోగ మొనర్చియు దురాచరణములవలనను పెక్కు-రోగములు పొసఁగించి ప్రాణగండములను దెచ్చిపెట్టుచున్నారు. ఘోరహత్యలకుఁ గారణభూతులగుచున్నారు, ఇట్టిసంసారములు దుఃఖభాజనములుగాక ప్రజలకానంద నిలయములు గాఁగలవా?

మఱికొన్నియెడల స్త్రీలు సంపూర్ణ స్వాతంత్ర్య మిషమున నైహిక వ్యామోహమునం జిక్కి లెక్కలేని దుష్కార్యాచరణము లొనర్చుచు వివాహబంధములం గట్టువడక స్వేచ్ఛావిహారులై నిండుజవ్వనమును దుర్వినియోగ మొనర్చి అనుగుణ దాంపత్యానుబంధసౌఖ్యము ననుభవించు యోగము లేక వ్యర్థలయి యిహపరంబులకు దూరులయి పరితపించుచు మనశ్శాంతికై విశ్వప్రయత్నము లొనర్చియుఁ బొరయలేక యంతరాత్మను నాశమొందించుకొనుచున్నారు. పురుషులును సంసారమహార్ణవమున ననుగుణ దాంపత్యప్లవమున శాంతముగా యాత్ర సాగింపనేరక తుచ్ఛవిలాస విభ్రమములకు లోగిపోయి యా యలలయందూగుచుఁ బైకెగసినప్పుడు కైలాసమందుంటిమని పొంగుచుడిగిపోవునప్పుడు అధఃపతితులమైతిమని కొరయుచు నిత్యశంకితజీవనులై యల్లాడుచున్నారు. ప్రణయసౌఖ్యము నందలి నిత్యానిత్యము తెలియలేక వ్యర్థజీవితులగుచున్నారు.

(అత్రిమునియు, అనహాంక్రియయుఁ ప్రవేశింతురు)

అత్రి—భవానికి వందనశతంబులు. తమరాకచే మాయాశ్రమము పవిత్రమయినది. మాజన్మము సాఫల్యమునొందినది.

గంగ—ఋషిసంతతి కెల్లఁ గుశలమగుఁగాక.

అన—ఆర్యా! నాకొక దుర్ఘటకార్య నిర్వహణమున కనుజ్ఞయీయ వేడుచున్నాను.

అత్రి—మానినీమణీ! నీశక్తిచూచుకొని నీవాచరింపఁగల కార్యమునకు నాయనుజ్ఞయేల? ఆమాత్రపు చనువు నీయఁజాలని కఠిను

నిగా నన్ను భావించుచుంటివా ? మన సంసార నిర్వాహణ శాసనముల నాకుఁ బ్రవేశము గల విషయము లందకంటె కడమ విషయముల నీకు నా యనుమతియేల? నీ యిచ్ఛవచ్చినట్లుఁ జరింపనగు. ఉభయ క్షేమాభికాంక్షితులమై మాత్రము మెలంగుట మనవిధి యని గుర్తెఱుంగవలసిన విషయము. అయినను చెప్పితివి గాన యడుగుచున్నాను. అదియేమి?

అనసూ.—(వినయాతురతతో నుంచును.)

అన.—ఈయమ్మకు—సర్వపాపహారిణియగు నీయమ్మకు త్రిలోకపావనియగు నీయమ్మకు—పాపములవలని భయము గలిగినదఁట. ఆ సంకటమును బాప నాచికిత్సఁ గోరి విజయము చేసియున్నది. నేనైన స్వతంత్రించి యీ కార్యమునకు బూనలేను. కారణాంతరములు పెక్కులుఁ గలవు.

సీ. ప్రళయాంతమైనఁ దప్పక చెల్లుబడియగు
అశరీరవాణి వాక్యమును దలచి
కడఁక నమోఘ సంకల్పుఁడౌ సురమౌని
పనిబూని పనిచిన పనుపుఁ జేసి
మనకు నేఁడుగడయు మనదికుఁ బ్రముఖునై
రహింపించు దేవకార్యంబు నగుట
భూస్థలి దుస్సాధ్యముల సాధ్యములఁ జేయఁ
జాలు భర్తృచరణాసక్తిఁ జేసి
గీ. తలపుమించిన పనియేని దలకబోక
కార్యసాఫల్య మొనరింపఁగల విశేష
భారమంతయు దైవముపైన మోపి
నే నిమిత్తమాత్రము నిల్తునేని గెల్తు.

అత్రి:—"శుభస్యశీఘ్రం" అట్లేయొనర్పుము. అంతకంటె నింకేమిగావలయును. ఈయమ్మ మనయశంబు నెగ్గించుటకే వచ్చినది. లేకున్న సర్వపాపక్షయ కారణికిఁ బాపముల బాధయేమి?

(గంగదిక్కై) అమ్మా! నాకిక సెలవు. నిత్యకర్మానుష్ఠానమునకు వేళయైనది.

(నిష్క్రమించును)

అన—(పతి పాదయుగళ ధ్యానమొనర్చి మంత్రతీర్థము నామెపైఁ జిలుకును. తెరపడును. తెరయెత్తగాఁ బవిత్రయగు గంగయు, అనసూయయు అనపాంక్రియయు నుందురు.)

గంగ—అమ్మా! నాసౌఖ్య మిప్పుడిట్లున్నదని చెప్పుటకు మాటలు చాలవు. వ్రణబాధితునకు వ్రణము పగిలినరాత్రి నిద్రాసౌఖ్య మెట్లుండునో నాకు నట్లున్నది. ఆనందమున పరవశత్వము నొందుచున్నాను. తల్లీ! నీఋణమెట్లు తీర్చుకొనఁగలను. ఇట్లువచ్చి గాఢాలింగన మిమ్ము. (కౌగిలించుకొనును.) నాకు నీవు కన్న తల్లివి. తల్లిలేని లోటుఁ దీర్చితివి. నేను నీవలన బునర్జన్మ మొందితిని. నీ వొనర్చిన మహోపకారమునకు నేను సర్వకాలమును కృతజ్ఞురాలనై యుందు. నీ తలచినయెడఁ బాడసూపుదు. నీ ప్రభావము నేనిక వేఱుగఁ జెప్పనక్కఱలేదు. లోకమున రాచిమెఱుపుఁజేసిన కల్లరాళ్లనే రత్నములుగాఁదలచుచున్నారు. నిజమైన రత్నములు భూగర్భమున నెందున్నవో యెవ్వ రెఱుఁగును? నేను నిట్లే పేరుగల తల్లుల నాశ్రయించి నిష్ఫలమనోరథనైతిని. నారదు ననుగ్రహమున నీ యప్రకాశమగు భూగర్భస్థరత్నమును బొడగంటిని. ధన్యనైతిని. ఇఁక నేను వెళ్ళుచున్నాను. కాని యొకవిషయము నెఱింగి నీవు మెలకువతో నుండవలయును. ఈ రత్నమును శక్తిత్రయము రాచి ప్రకాశవంతము చేయనున్నారు. అది వారిలాఘవమునే వెల్లడించును. కాని మీ కేమియును హానికలిగింపదు. నాకిక సెలవు. (వెళ్లుచు)

సీ. ఈ కుటీరమె సాక్షి యీమె నిరాడంబ
రామల జీవన మచ్చుగూర్ప
ఈ వాకిటి కురంగమే సాక్షి యీమె య
మాయిక తాత్వప్రమాణమునకు

ఈ హితవాక్ర్గతియే సాక్షి స్వాతిశ
యవిమారతా దర్శమునకు నీవు
ఈ ముఖాంభోరుహామే సాక్షి యీమెద
యార్ద్రహృదంతర యని వచింప

గీ. పాపశంక సంపాతయై పరితపించు
దైన్యశాంతనియద్గంగ ధైర్య ముడిపి
పావనమొనర్చుటయె గాదె ప్రబలసాక్షి
సహజమహిత పాతివ్రత్యమహిమ జాట

(నిష్క్రమించును.)

# సతీ అనసూయ

## తృతీయాంకము

### రంగము 1

స్థలము—అత్రిముని ఆశ్రమము.

(తెరయెత్తగా నత్రియు ననసూయయుఁ గూర్చుండియుందురు.)

అత్రి—(కన్నులు నులుముకొనుచు) సాధ్వీమణీ! ఏమిః ఈ మైకము. ఎన్నఁడును లేని నిద్ర యేల నాకీ మధ్యాహ్నమున. పాపము శమించుఁగాక. (తేరిపారఁజూచి) ఇదియేమి? యీ యమూల్య నాగాభరణ మింతలో నెక్కడనుండి వచ్చినది.

అన—(చిరునగవుతో) నాథా! అది యంబికా ప్రసాదమని యాకాశ వాణి వచింపఁగా వింటి.

అత్రి—ఏమిది! విచిత్రముగా నున్నది. అంబికయేమి! ప్రసాదించుట యేమి! ఎందులకుఁగాను.

అన—మదీయ పాతివ్రత్య మహిమాతిశయమునకుఁ గాను.

అత్రి—పాతివ్రత్యమునకుఁగాను పారితోషికమా? అది భిక్షుకుని భార్య యంపుటయా? ఇదివర కిట్టివి కనివిని యుండలేదే. సతీ మణికిఁగూడ నీ సతీత్వము నచ్చినదా.

అన—నచ్చుటయేగాదు. అసూయ హెచ్చినది. అనసూయ నెట్లు మెచ్చునది. దానఁ గొంచెపుఁ బనులకుఁ జొచ్చినది.

అత్రి—అసూయచే ననసూయకు నాగాభరణ మేలయిచ్చినది. ఇయ్యది యుపకృతియా? అపకృతియా?

అన—అపకృతి యననేల? యశం బెగ్గించుట నుపకృతియే యనరాదా? కాని నాగాభరణ మంపలేదు. చేతనైన పనిగనుక మహా నాగమునే యంపినది.

అత్రి—మహానాగమునే! మఱి యిదియెట్లు?

అన—తమకు నాయందుఁగల యవ్యాజానురాగ ప్రభావమున: దమ నామము స్మరించునంత మహానాగము సువర్ణనాగాభరణమైనది.

అత్రి—అటులైన నీ ప్రభావమునకుఁ బలినైన నేనుఁగూడ గర్వించవలసినదే!

అన—అంబికా ప్రసాదమునకే గర్వించుచుంటిరా? శ్రుతి వాణీ ప్రసాదమా.

అత్రి—అది యెట్లు లభించినది? దాని చిహ్నమేమయినం గలదే? అదియును వికటముగనే లభించినదా?

అన—ఈ మహాక్షేత్రమ్మున భోజనానంతరము నేను పాదము లొత్తుచుండఁగాఁ దమరొక పాదమును నాయూరుతలమునందుంచి నిద్రించితిరికదా!

అత్రి—అయిననేమి?

అన—అట్టి సమయమున నొక్కకోడె వయసువాఁడైన యతి శారదా ప్రబోధితుండై వచ్చి వాకిటనిల్చి "భవతీ భిక్షాం దేహి! ఆకలిచే కడుపు నకనకలం బడుచున్నది. నాలుక పిడుచవాఱుచున్నది. కన్నులు పీకెబాఱుచున్నవి. చెవులనుండి వేడిగాడ్పులు వచ్చుచున్నవి దయయుంచి యొక కబళము వేయుము." అని కేక వేసెను.

అత్రి—యతికి భిక్షనీకుంటివా?

అన—తమకు నిద్రాభంగము గలుగునేమో యనుభయమున మాఱుపలుకక నెమ్మదిగాఁ దమపాదము దొలగించుకొని భిక్షవేయఁ బోతిని.

అత్రి—పోయిననేమయినది?

అన—పోయిచూచునంత నాయతి యాగ్రహాగ్రహావేశమునఁ గన్నుల మిణుగురులు సెదర, కటకటంబు లదర భ్రూయుగంబు ముడివడ,

కిటకిట పండ్లు గీటుచు నన్ను సుడియఁజూచి రోజుచు నోడు గరచి మహా భయంకరాకారుఁడై "హే ఛండాలీ! ఆకట నట మటించుచు నార్తుఁడనై, పిలువఁ బలుక నైనఁ బలుకక నన్ను నిట్లు జులకనఁ జేసి యాలసించెదవే! చూడుము! నిన్నేమి చేయుదునో!" అని తన సిగయందలి యొక జటపెరికి యభి మంత్రించి విడచె.

అత్రి—తపోగర్వమున నోడలు మఱచి తరతమభేదము లెఱుంగఁ జాలకపోయె, పాతివ్రత్యము ముందు తపోబలము గాదు గదా, దైవబలముగూడఁ బని చేయలేదని యెఱుఁగ లేకపోయె. అంత నేమయ్యె?

అన—ఆజటయు నచ్చటఁజూచినఁదానయై రోదసీకుహరమెల్ల వ్యా పించి మండుచు 'స్ఫుట స్ఫుట' నినాదములచే మిన్ను బీటలు వార నాపైకి రాఁగడంగె.

అత్రి—అపుడు నీవేమిచేసితివి?

అన—దిక్కుదోపక భవదీయ మృదుపద సరసీరుహ యుగళధ్యాన మొనర్చితి.

అత్రి—అట్టి ముప్పెట్లుదప్పె?

అన—అంతట నావచ్చుజడ వెనుకకుఁదిరిగి యావరివ్రాజకు నే నిలు వున దహించెను. అందువలననే శారదాప్రసాదము నిష్ఫల మయ్యెను.

అత్రి—మానినీ మణీ! భవదీయ ప్రభావమునకెంతయు నమందానంద కందళిత హృదయారవిందుండనైతి. పాపము శారదకు ప్రత్యు త్తరము లేదు. అంబిక కేనిఁ బ్రత్యుత్తరమీయవా?

అన—అదియెట్లు. నేనామెకుఁ బ్రత్యుత్తర మీయఁగలదాననా? నీ వేమియుఁ బ్రతిక్రియ సలుపనక్కర లేదు. పాపము! విశ్వేశ్వరుని యాభరణము గ్రహించుట భావ్యముగాదు. ఈశ్వరప్రసా

దము పుచ్చుకొనరాదని యెఱుఁగవా? కాన వెంటనే పంపి వేయుము. అదియే ప్రత్యుత్తరము.

అన — అగు నిది దూతకృత్యమునందు వర్తించుచున్నది. దూతను నిలిపివేయుట ధర్మముగాదు. తన యనుగ్రహము చొప్పుననే విడిచిపుత్తునుగాక. (అని కంఠాభరణముదీసి క్రిందనుంచి మంత్ర తీర్థముజల్లును. అది సర్పమై వెడలిపోవును.)

## తృతీయాంకము

### రంగము 2

స్థలము అత్రి మున్యాశ్రమము

(మన్మథ వసంతులు ప్రవేశింతురు)

మన్మ — వసంతా! మదీయ చైత్రయాత్రకు సర్వమును సన్నద్ధ పరచితివా?

వసం — వయస్యా! సర్వము నాయత్తపఱుపఁగలిగితినో లేదో, నే నెఱుంగ. ఈవనరంగము నెల్ల నీవే పరికించుము.

మన్మ — వనప్రదేశమునెల్లఁ బరికించిచూచి, శభాస్! వయస్యా అన్నియును బాగుగనే యున్నవి.

సీ. రాగయుక్తంబులై రాగయుక్తములయ్యె
చివురుపెట్టిన చెట్టు చివురుబోండ్లు
వలపుల వెలిబుచ్చి వలపుల వెలిబుచ్చె
పుష్పవతులు తీవె పూవుబోండ్లు
రసవంతములు మధురసవంతములునయ్యె
మత్తిలు మధుపాళి మదవతులును
ఫలవంతములు లసత్ఫలవంతములు నయ్యె
కోర్కెలూరెడి మావిగున్న చెలులు

గీ. కొనలు సాగుచు గోరుటాలు కొనలుసాగు
చేరుచున్నవి మల్లియ తీవెబోండ్లు
తావులనుమించి తామున్న తావులెల్ల
సార్థకము చేయు సంపెంగ సకియలెల్ల.

అదిగో! శుకుఁడు పండ్లుగొఱుకు చున్నాడు. వనప్రియుఁడు గ్రుడ్డెత్తిజేసి కేకలు వేయుచున్నాఁడు. శిఖినిఁజూచి శిఖి సమర కుతూహలమున పెట్టెంతలు వేయుచున్నాడు అళులవారి కదు పకనేజమ్మని విప్రయోగకర్ణపుట విపాటనముగా మ్రోగు చున్నది. కాలమును మనకనుకూలముగా నున్నది. చూచితివే! వారుణీమోహాంధీకృతచేతస్కుఁడై దిననాథుఁడెటఁ గ్రోసి రాజునకునై ఛాయాదూతికల సంపుచున్నది. వచ్చెడి రాజు మనవాఁడై యుండ మనకేమి యొనర్పరాకుండు. అదిగో! మలయపవనుఁడు చేయూత నొసఁగు చున్నాఁడు. ఈపవనాస్త్రమునకు సాధింపరాని కార్యముండునా? మనమెంతసన్నద్ధులమై యున్నను వైరులపైకి సమయము విచారింపక పోరాదు. ఇదియేగదా యత్రిమహామునాశ్రమము. ఈవృక్షవాటికవారి దే. ఇందు కొంచెమాగి తగుసమయము చూచి పోవ్రదముగాక. (చెవియొగ్గి వినును) అదిగో! ఎవరివో యడుగుల చప్పుడు వినబడుచున్నది. నిశ్శబ్దముగా నుందము. (పరికించి చూచి) వెదుకఁబోయిన తీవ కాలికే తగిలినది. అనసూయయు ననప్రియయు నల్లంత నిటే వచ్చుచున్నారు. మనమీ చెట్ల గుబురున డాగి వారి సంభాషణము లాలించి వారి హృదయస్థిత భావములను గుర్తెఱుంగుదము.

మన్మ—(ఆమూలాగ్రము అనసూయను పరికించి) ఏమీ! ఆ నైజ సౌందర్యము. ఏమీ! ఆ యవయవసౌష్టవము. మంగళసూత్ర మాత్రాలంకారయయ్యును, వల్కల ధారణమున నీయిల్లు వెలుగొందు నీమెకలంకారములింక నేమి యలంకారమీయఁగలమని గాఁబోలు డగ్గర వెఱచి దూరస్థములైనవి. పతివ్రతల ప్రభావము

ఫలవంతములై యడుగనివారి పాపమునఁ బోవుదురన్నట్లు చేయిఁ జాచినవారలకెల్ల వందించుచుఁ దత్ఫలంబుల సఫలం బొనర్చు చున్నవి. సుమనసోపేతములై యెల్లర సుమనస యుక్తులఁ గావించుచున్నవి. ఇట్టిసద్గుణంబు లెరియందేనిఁగలవే.

అసహాం—సత్యము!సత్యము (కొంచెమునడచి) ఈకొమ్మనుఁజూడుము శుకునకు ఫలాహారమొసఁగుచున్నది.

మన్మ—సఖా! చూచితివా! ఈ కొమ్మపై బండ్లుగొఱుకు చిలుక తీవ్రత తేఁకురు మొగంబుఁ జూచియు నెఱుఁగనేరని యదవిమానిసి నేమనవచ్చును? పాపము! వ్యంగ్యము నెఱుఁగక ఆకొమ్మ ఫల ప్రదాన మొనర్చుచున్నదని సంతసించుచున్నది. తానును మదీయవాంఛితార్థ ఫలప్రదాన మొనర్పఁ దనప్రియసఖని ప్రేరేపించునా?

అన—ఆహా! ఈ లతాతన్వుల దానగుణ మేమనవచ్చును. నిలుకలేని యీ భ్రమర తండములకు సుమనసంబుల మధురసంబు లామెతలు వెట్టుచున్నవిగదా!

మన్మ—వయస్యా! ఈ లతాతన్వుల దానగుణంబునకు నలరు నీలతాతన్వి స్వవిషయంబున నెట్లుండునోగదా. ఎట్లేమి? దానగుణంబున కింతయలరు నీమె సంయమి కాంతయై నన్నలయించునా?

వసం—ధర్మవన్నములు చెప్పువారేగాని చేయువారుండరు. నీకాసందేహమేల? అదియును ఆసన్నమగుచున్నది. చూతువుగదా! ఆ యతివ యధరసుధారసపానమత్తబంభరుండవేయైన గృతకృత్యుండవే యగుదు.

అన—(కొంచెము నడచి, వ్రేలుచూపుచు) అవహాః ప్రియా! అటు చూడుము, ఆ గుజ్జుమామిడి కొమ్మజంటి తేనియ నెల్ల సోమరి యీగలు త్రాగిపోవుచుండ వాని నా యీగ లెట్లు తరుము చున్నవో చూచితివా?

అనహం—అగునమ్మా! అతి సంచయేచ్ఛాపరులెవ్వకును ధన హానిని జూచి యిట్టులే దుఃఖించుచుందురు. నిత్యమును తమకు విందులొసంగు బహువర్ణ సుమనస సంశోభిత లతానవ్వు లుండ నత్యాశమై దేనియఁగూర్చి దాని పోకకిట్లు లేనిపోని వగలం బొగులుచున్నవి.

అన—అయ్యో! పురుగుపై బుట్ట. పావమా పెరనంతయు నొక వాసరము హరించి యమిత లోభమున విడిపోకున్న మధు మక్షికలతోఁ గూడ నాహరించుచున్నది.

మన్మ—సెబాస్! లోభము పనికిరానిదే. అది సత్కార్య కరణమున కాటంకము. అట్టి లోభబుద్ధి మాని తానర్థుల సర్వార్థసిద్ధుల నొనర్పఁ గడంగుఁ గాబోలు.

అనహం—ఉదుతాభక్తిని వారిధి బంధనమున సాయపడి శ్రీరాముచే వెన్నున దువ్వఁబడి ముద్రితములైన యంగుళులరేఖ లిప్పటికి సజ్జన పక్షపాతి యని సాక్ష్యమిచ్చుచుండఁ గలివిడంబనమునఁ గాబోలు నీయుడుత సుమనసంబులఁ గలంచుచు, సత్ఫలంబులఁ దొలచుచు లేఁగొమ్మలఁ గొఱుకుచుండె. దానికేమి సఖి! యీ వసంత మెంతయు మనోహరము సుమా!

గీ. త్రిభువన విజయస్ఫూర్తిఁ బేర్మిని వహింప
మదనుఁ డొనరించు చుండిన మఖములోని
హోమకుండపు జ్వాల లొక్కో యనంగ
వెలుఁగుచున్నవి చివురు లీవృక్షరాజి.

గీ. సవన కాలంబు నందున సామగాన
వితతిస్వరయుక్తముగఁ బాడు ద్విజుల పోల్కి-
శ్రుతిహితంబుగను శుకప్రభృతులు ద్విజులు
నెలమిఁ గలకలఁగూసెడు వింటివింటె.

గీ. సోమపాన మొనర్చు భూసురులఁ బోలి
మధు రసంబుల నానిన మధుపపాళి
యొడలెఱుంగక ఝమ్మనఁ దొడగె నవిగో!
సకియ యేమనవచ్చు వసంత మహిమ.

అగహాం—ఇది ప్రకృతిసహజ వర్ణనము. ఇందతిశయోక్తి యావంతయును లేదు. అవలీలఁబోయి పుష్పాపచయంబొనర్చి యుటజంబునకుఁ బోవుదము. త్వరగా నడువుము. (నిష్క్రమింతురు.)

(అంతట మన్మథ వసంతులు పొదలలోనుండి వెలువడుదురు)

వసం—సఖా! వినయము భాషింపఁదలచినను మానవులకుఁ దమ ప్రవృత్తి కనుగుణ్యములగు పదములే సందర్భానుసారముగాఁ దొరలుచుండును. మన్మథాగ్నికి మారుగాఁ బ్రజ్వరిల్లు పల్లవనివహములను యజ్ఞకుండమునందలి యగ్నిహోత్రమునకును, విప్రయోగకర్ణపుటపాటన సమర్థములగు కీరశారికాగానంబుల మనోహర రుతంబుల సామగానంబులకును, బహుళ సుమనస ముఖ సుధారస పానమును హేయమగు సోమపానమునకును పోల్చి చెప్పినది. సంయమికాంతలకు శృంగార మార్దవ మేమి యెఱుంగనగును.

మన్మ—నిక్క మెఱింగితివి. త్రిభువనంబుల నెవరు నా యానతి నతిక్రమింపక శిరసావహింతురు గాని యీ మొండి తపసికట్టెలను మాత్రము సాధింపలేకుంటి. అబ్బ! ఆ కుమార సంభవము నాఁటి గొడవలు జ్ఞప్తికి వచ్చిన గుండెలు జలదరించుచున్నవి. ఇఁక ముందట్టి దుష్కర కార్యములకుఁ బూనవెనుకంజ వడుచున్నది. నాఁడు తపోభంగ మొనర్పఁబోయి యట్టిపాటు పడితి. నేఁడేమి కానున్నదో భగవంతునకెఱుక. ఏది ఎట్లున్న మాత్రాజ్ఞ యనుల్లంఘనీయము. సాసూయయగు జననివంపున అనసూయా వ్రతభంగ మొనర్ప నిదే సమకట్టితి. మిత్రమా! నీవిందే జాగరూకుఁడవై వేచియుండుము.

వసం—కాదు, కాదు! పతిభిక్షకై వేడ రతిం బిలచి కేర నిదే యేగు
చున్నాఁడ.

మన్మ—ఈ హేళనమున కేమిగాని ధైర్యము చెప్పి పంపుము.

వసం—వెనుక మహామైధన సంకల్పమునకు సమస్త దేవతలును ప్రోత్సహించి కావా పంపినది? నీవే కాదు. ఇట్లు తాపసులపై తారసిల్లిన వారనేకులు ప్రాణాపాయములను, దుష్కర శాపములను బొందిరి.

మన్మ—దేవతలమైన మనకుఁ బ్రాణాపాయమేమి! ఎంతసత్యమునకు వత్తులు బ్రింగినను మానవ మాత్రులచే నగుటయేమి! ఇక శాప భీతియా! శాపములు మనఁబోట్టినయెడల చిన్ననాఁడే నమయ వలసినదే. మనలఁ దిట్టనివారును వర్షమునకుఁ దడియని వారును మచ్చునకును లేరు. అదియట్లుండ నాకొక ధైర్యము గలుగు చున్నది. మును పే చెవిన కాపురమునకు ముప్పేమి ధరాపతికి నకు నింకయు సద్గతి గలదా?

గీ. హరుని కనుమంట మున్న రూపఱిన నన్ను
నింకనుఁగా రూపుమాపెడి దేమిమాకు
నెంతలావు పతివ్రత యేని గాని
నిండ మునిగిన చలియుండునే ధరిత్రి.

వసం—నీకట్టి ధైర్యమే కలిగిన నేనేమి చెప్పఁగలను? కానున్నది కాకమానదు. పోమ్ము. (తనలో) 'బుద్ధిః కర్మానుసారిణీ'. ఇప్పుడు నే నేమి చెప్పినను లాభము లేదు. అవమానము తప్పదు. అహంభావ మూరక పోవునా? ఆ యమ్మకు తగిన కొడుకు.

మన్మ—అల్లదే! అనసూయ. శరసంధాన కొనర్చి మఱి పోవుదము.
(అవలకు పోవుదురు. తెర పడును.)

## తృతీయాంకము.

### రంగము ౧

స్థలము— వైకుంఠము. (వసంతుఁడు ప్రవేశించును.)

వసం—అహా! యీ శక్తిత్రయము దలంచిన నేమి చేయలేరు!

క. కలవారలు నధికారముఁ
గలవారలు కులము బలముఁ గలవారలు మి
క్కిలి జిగి గలవై పొంకము
గలవార లకృత్యమునకుఁ గడఁగిన ననదే.

వీరు ప్రాకృతుల నేమేని చేయఁగలరు. కాని సంయమినికడ వీరి యాటలు సాగివచ్చినవి గావు. అది యట్లుండ వీరి కా అనసూయపై నింత యసూయ యేల? గంగాభవాని నామె పవిత్ర మొనర్చిన వీరికేమి యవమానము గలిగినది ఆమె పాతివ్రత్య ప్రభావయుతమైన వీరి సతీత్వమున కేమి మచ్చ వచ్చినది. అందుల కామెపై మచ్చరమా. ఆమె వ్రతభంగ మొనర్పఁ బ్రబల యత్నము లొనర్చుటయా? వీరి యహంకారము చెప్ప నలవిగాదు. వీరి యెదుట నాకాశమెత్తనుటకును, సముద్రము లోతనుటకును వీలు లేదు. తమ చేతఁగాక పోగా నామె యొనర్చిన మహాత్కార్యమునకు శ్లాఘించుటకు మారుగా సాధించుటయా. ఇది కానిపని. వీరివలనఁ గానిపనియును

గీ. భీషణ విషోరగము స్వర్ణ భూషణముగఁ
గ్రుద్ధుఁడగు యతి దగ్ధస్వరూపుఁగాఁగ
మనసిజాతుని పరమావమానితునిఁగ
రహినొనర్చిన యనసూయ మహిమ యరిది.

మన్మథుఁ డామె యెదుటఁబడుటకు సిగ్గునొంది యీవృత్తాంతము నామె కెఱిఁగించుటకు నన్ను పురెత్తించుటచే నిక్కడికు వచ్చితిని. అంతఃపుర ప్రవేశమున కనుజ్ఞకొరకై ప్రతీహారిని పంపి ప్రత్యుత్తరమునకై ప్రతీక్షించుచుంటి. అతఁడింకను తిరిగి రాలేదు.

ప్రతీ—(ప్రవేశించి) అయ్యా! రావచ్చునని సెలవయైనది. నావెంట రండు.

(తెర యెత్తగా లక్ష్మి యుండును, వసంతుఁడు ప్రవేశించును.)

వసం—తల్లీ! కలుములవెల్లీ! నమస్కారము (అని నమస్కరించును)

లక్ష్మి—ఏమీ! ఒంటరిగా వచ్చితివి? మా మదనుఁ డేడీ?

వసం—వచ్చినాఁడు. తిరిగి వచ్చినాఁడు.

లక్ష్మి—పోయిన కార్య మేమి చేసివచ్చితిరి?

వసం—అవధరింపుము. వెళ్లితిమి. అత్రిముని యాశ్రమమునకు కాల ప్రభావ మగణ్యము. కాన సమయము గుర్తెఱింగి రాజు మన వాఁడై యుండి శుభ ముహూర్తమున మహోత్సాహమునఁ ప్రబల సన్నాహములతో మీనకేతనము మెట్టి మీనగుచుండ మదన సామ్రాజ్యము వలె నున్న వారి యుద్యానవన వాటిక యందే విడిసితిమి. తలచినకని తలవాకిటనే యైనది. ఆన సూయ వచ్చుటనే చూచితిమి. తుమ్మెదల నారి జుమ్మని ప్రమోయ నవవికసిత పుష్పసాయకము లక్ష్యము చూచియే వదలినాఁడు కృతహస్తుఁడేగదా మీకుమారుఁడు. త్రిజగన్మోహన కళాధురీణుఁడే లక్ష్యమును భేదించినదియును లేనిదియును గుర్తెఱుఁగ లేకపోయె. తా విడచిన యస్త్రమును నా నిలిచిన యస్త్రమును నేర్పరించలేక నిశ్చేష్టితుఁడై నిలిచి పోయినాఁడు. భేదించితినని యతఁడును, లేదని నేనును కొంత తడవు వాదించుకొంటిమి. తిరుగ లక్షించుమని ప్రతిమాలితిని. కాని తనప్రతిష్ఠకు హానివచ్చునను తలంపున నిరాకరించెను.

లక్ష్మి—కానిమ్ము అటుపై వృత్తాంతము.

వసం.—అదను వేచి యత్రిముని వేషమున నామనుసమీపించెను. ఇంత వఱకు నేను కనులారఁజూచిన విషయము పైవృత్తాంతము నాతనిముఖమునవింటిని.

లక్ష్మి—అదియేమి?

వసం—అట్లుపోయి యొంటరిగ నామె యాశ్రమమునందుఁ గలసి కొనెనఁట, ముఖభ్రూకుటీబంధ హావభావ విలాసములతోడను, కరన్యాస పదన్యాసములతోడను మోహనకళానైపుణ్యము నంతయును నామె యెదుట జల్లి కురియించుచు నొక చిత్రనాటక ప్రదర్శనము మొదలుపెట్టెనఁట. అతఁడు రూపమున పతికి మారుగనున్నను కామవిలాసచేష్టావికారముల నన్యుఁడుగా నానవాలుకట్టి యొకకన్నుచేసి మెలఁగుచున్నదఁట. ఎంతసేవ చేసి నామె హృదయము నాకర్షింపలేక యుండియామె మనంబున నీబిడ్డఁడుండుట నవలోకింపఁగా నామె సందేహము బలపడిన దఁట.

లక్ష్మి—(వివర్ణముఖయై) సందేహించి!

వసం—నిలువరించి, యెడతెఱుఁగరాక దోషాచరణకుఁ గడంగితివా ఇంతద్రోహకారివి నీవెవ్వఁడవో చెప్పుము. లేకున్న శాపోపహతుండవగుదువు ఇంద్రజాలికునివలె లోకముల నెల్ల సమ్మోహనమొనర్చి కళంకీభూత మొనర్పఁదలంచితివా? అని గర్జించినదఁట.

లక్ష్మి—(సక్రోధయై చూచుచుండును.) తెల్పుము కడముట్ట వినిపింపుము.

వసం—అంత నాచెలువుఁడు పెక్కుతంత్రములు బన్ని తానుఅత్రినేయని యామెచే నమ్మించుటకుఁ బ్రయత్నించియు విఫలమనోరథుఁడై యామెకు మఱింత యాగ్రహము గలిగించెనఁట. అపరాధము పరిశోధింపఁబడెను. తప్పించుకొనుటకు మార్గాంతరములేక నిర్విణ్ణుఁడై కన్నులు తేలవైచి మన్నింపుమని కాళ్లఁ బ్రేళ్లఁబడి ప్రార్థించి సత్యము నెఱిఁగించి, ప్రాణము దక్కించుకొని పుట్టెఁడు పరాభవముతో నిల్లు చేరెను. కార్యము చెరచినందులకుఁ బశ్చాత్తాప పడుచున్నానని తమకు మనవి చేయవలసినదిగా నన్ను బుత్తెంచెను.

లక్ష్మి—(తలకంకించుచు) ఆఁ! ఆఁ! ఏమి, ఎంతటి పరాభవము! త్రిజగన్మోహన మూర్తియగు నా కన్నతండ్రి కెంతటియార్తి చేతులారఁ దెచ్చితిని (కొంతసేపు ఆగ్రహ తీవ్రమున మాటరాక నిశ్చేష్టత వహించి కటకటమని లదరఁ బండ్లు గొఱుకుకొనుచుఁ బ్రకాశముగా) ఇంతకు నాయజ్ఞానమే గదా కారణము. కానిమ్ము. దాని యాధిక్యము నిలువనిత్తునా! ఈమాత్రపు టిల్లాలిని ఖండింపలేకున్న యికనా యాధిక్యమేమి లోకముల నెల్ల నడిపించు నా శ్రీమహిమ నిర్గుణులకు లోనగుచున్నదా! ఎఱుఁగదు గాఁబోలు నీ లక్ష్మీప్రభావము. ఎంత శక్తిసంఘములను నా యెనుటఁ గన్నులు కేల వేయుచున్నారో. ఎంతటి వేదాంతులును నాకు దాసోహమ్మని యవకతవకలకు దిగుచున్నారు. ఎట్టి యిల్లాండ్రును నా కనుసన్నల గడి గడలేక నెన్నెన్ని యకార్యములో చేయుచున్నారు. ఎట్టి ఘాతకయాజకులును నా కొఱకై యెన్నెన్ని హత్యలనో యనుకాడక చేయుచున్నారు. నన్ను లక్ష్యము చేయనివారు కుడువ గంజియుఁ గట్టబట్టయు లేక శల్యావశిష్టులయి యల్లాడుచున్నారు. కొలుచువారును పలుకువారును లేక దిక్కులేని చావు చచ్చుచున్నారు. వారి తెలివి నేటలఁ డఁగాచిన వెన్నెలయగుచున్నది. వారి ప్రజ్ఞాప్రభావములను తాకితలమువారు లేరు. వారి పౌరుషము పేదల చేతున నే కారణమగుచున్నది. అదియేమి! ఇదియేమి! వారు పుడమినుండియు లేనివారే. నాకటాక్షము ప్రసరించిన నరణ్యము మమరావతియగుచున్నది. చవటపీనుఁగు సార్వభౌముఁడగుచున్నాఁడు. పిరికిపంద జగద్వీరుఁడగుచున్నాఁడు. నేను పట్టుకట్టిన పంది నంది యగుచున్నది. నేను తిరస్కరించిన నంది పందియగుచున్నది. వేయేల. ఈ చతురబ్ధి వేలావలయిత ధారుణీచక్రమున నేనాడినది యాట పాడినది పాట.

(నిష్క్రమణము)

---

# సతీ అనసూయ

## చతుర్థాంకము

### రంగము 1

ఇంద్రసభ—ప్రవేశము—సుధర్మ

(ఇంద్రుఁడు, చంద్రుఁడు, బృహస్పతి, భృగుఁడు, గౌతముఁడు, విశేఖరి, వంది, విదూషకుఁడు.)

విదూ—ఈవేళ మా సభను మానవుల నాటకములోఁ బూర్వరంగ మొనర్తును. నేను విదూషకుఁడను. అంటే సామాన్య మానవలోకములోని వాఁడనుగాను. సంపూర్ణ భోగాభిలాషయే పరమావధిగాఁ గల దేవలోక విదూషకుఁడను. కాఁబట్టి మా ప్రహసనములు చాల ప్రౌఢముగ నుండును. పైమెట్టులో రసములు తలమానికలుగా నుండును. మానవమాత్రులు తమమీఁద దాము జూచుకొని యులికిపడు స్వభావము గలవారు. మేమట్లుగాము. మాకు మునిపంటిమీఁద నవ్వు, ముక్కుమీఁద కోపము నుండదు. "ఆనందో బ్రహ్మ" అనుకునేవారము గనుక—అటువంటి ప్రసంగమాత్ర ప్రహసనములు దైహికములుగా భావించుకొనక, భారతీవృత్తి యెంతవఱకు నడచినదో పరిశీలించి యానందించుటయే ప్రధానముగా భావింతుము. మానవులలోనే యిట్లు జరిగిన యెడల సరసములు విరసములై తలపట్లవఱకు రాకమానదు. దేవనాగరికులము గనుక గీర్వాణము సంగీకరించి దాని భావము మనసునఁ బట్టించుకొని నిర్వికారముగా నిలువఁగలము. స్వల్ప విషయములకు ఖండనమండనములు పెంచుకొని వెళ్లడికి రాము. ఇప్పుడిపుడు మానవులలోఁగూడ కొందరు ప్రబుద్ధులు నాగరికప్రపంచములోని వారు. లోకులు పలుగాకులు. లోకులతో మాకేమి పని. ఈ మూఢలోకముతో మాకేమిపని. అని శుద్ధ వైరాగ్యమును

చూని తమ్ముఁగూర్చి లోకమేమి తలంచుచున్నదో గణించక యే ధైర్యసాహసములతో సంచరించుచున్నారు. ఇది ప్రస్తావన. ఇక రాబోవునది నాంది. ఈ నాంది దేవలోకమునుండి మానవ లోకమునకుఁ బ్రతిఫలించవలె. ప్రతిఫలించునపుడు కుడి యెడమగాను యెడమ కుడిగాను మారుట ప్రకృతిధర్మము. ఎంత దేవతలైనను ప్రకృతి ధర్మములకు బాధ్యులై యట్లు జరిపించుచున్నాము. సందేహించక ప్రస్తావనానంతరము నాంది గ్రహింపుండి. ఇఁక వైతాళికుడువచ్చి కర్తవ్యప్రశంసఁజేసి నాంది నడుపును. ఇది మామూలు పాతముగనుక మామూలాచారమునకు భిన్నముగాకుండ వచనముగానే నడువనీయండి. తరువాత కథ తనంతతానే నడుచును. మహాప్రభావవంతులగు దేవత లొకరి సహాయమున నడచునదేమి? అంటే కథకు గాళ్లు లేవు. ముంతకుఁ జెవులు లేవు.

వంది—(జనాంతికముగా) ఈ నడుమ చాలకాలమునుండి సభ లేక పోవుటచేత స్తోత్రపాఠములు బొత్తుగా మఱచిపోతిని. ఇప్పుడు జ్ఞాపకము చేసికొనుట నాతరమా? నా యబ్బతరమా? అవేమి సామాన్యపు దండకాలా? మా తాతలతాతలెవరో వ్రాసిన పాగచూరి పాగచూరి యున్న తాటియాకుల పుస్తక మొకటి మా యింటిలో మసెలమీద నుండవలె. అది యొకసారి "శ్రీరామకృష్ణ పరబ్రహ్మణేనమః" అని యంటూవచ్చే పౌరోహితపు బాపనాయన చేత చెప్పించుకుందామంటే ప్రొద్దననే నాకు మెలకువ వచ్చినదికాదు. ప్రభువువారి సొమ్ము తింటూ ఊరకుండుటకు వీలులేదు. వచ్చినదో రానిదో వాగి పోవలసినదే. (అని గొంతుక సవరించుకొని.)

అహల్యా రుజనకు జోహారు. పాకనాశనునకు జోహారు.

(అని పై వాక్యము జ్ఞాపకమురాక ఆలోచించుచుండును.)

విదూ—ఇఁక చాలును. కాలవిలంబనమగుచున్నది. రెండుమాటలైన నిక్షేపములాంటివి. వర్ణదోషము లున్నను సార్థకముగానే

పడినవి. అహల్యారుజునకు జోహారా! అదే సహస్రాక్షత్వములోనికివచ్చి ముల్లోకపరిపాలనార్హత స్థిరపరచినది. పాకశాసనునకు జోహారా! సత్యము సత్యము. నరకుఁడు సర్వేశ్వరుఁడై స్వర్గమునుండి మమ్ము పారద్రోలినప్పుడు, దిక్కున కొఱకరమై పోయినాము. ఆసమయములోఁగూడ మేమిర్వురము నొకదిక్కునకే పోయినాము. ఎట్టులయిన నేమి? కష్టకాలమునఁ గూడ రాజాశ్రయము విడువక పాకునికి విశ్వాసపాత్రుఁడనై వన్నెకెక్కితిని. అప్పుడు వారు పాకశాసనులు. నేను గంగాధరుఁడను. ఆఘట్టములో పద్రసములు చప్పఁబడుటవలన 'పాకశాసనుఁడు' అను బిరుదము నేనే వారికి స్వయముగా ప్రసాదించినాను.

విశేఖరి—(కాగితపుకట్టను చేతబట్టుకొని లేచి నిల్చి తనలో)నావద్దు నాకుపశినది. ఇక నమలులోనికి తేవచ్చును. నెరవేరిననేమి నెరవేరకున్ననేమి?

ఇంద్రు—(తల పిసికికొనుచు) ఏమది శేఖరీ!

శేఖరి—ఏఱుయును లేను నర్మద యనెడి యొకచిన్నది తనను పతివ్రతల పట్టీలో చేర్చవలయునని విన్నపము చేసికొనుచున్నది. తారీఖు చూడండి. ఇక్కడికి అది దాఖలయి యారుమాసములయినది. మానవ మాసములు కాదు. దేవమాసములు. ఇది, పరకే నాలుగు దరఖాస్తులు పంపుకొనినదఁట. అవియన్నియు బుట్టదాఖలయినవని యిందుదాహరింపఁబడియున్నది. కావున ఖామందులవా రనుగ్రహించి విచారింతురని యెసంగుచున్నాను.

ఇంద్రు—(విసుగుతో) ఏమిటోయ్! నీ లొడలొడ. అబ్బా! ఈ పతివ్రతల చిక్కులతో మా పని యగుచున్నది.

విదూ—అందరు పతివ్రతలే యంతుదెలియనివారికి ప్రాతఃస్మరణీయులగు పంచకన్యలలోని యహల్యాపాతివ్రత్యము దేవరవారి

కౌతుకయే. ఒకతార పాతివ్రత్యము చంద్రునకు విశదమే. వేఱొకతార వాలి సుగ్రీవులకు పాలిసొత్తయినది. ఇఁక మండోదరి యంగదునకు తల్లి యై యేగదా రామాయణము చెప్పుచున్నది. పంచభర్తృకయైన ద్రౌపదిని కర్ణునకు దార్తవని శ్రీకృష్ణుఁడే కంకణము గట్టుకొనెనుగదా? ఇఁక సామాన్యుల సంగతి చెప్పనదేము?

ఇంద్రు— (సింహాసనమునుండి లేచి) మాకు గురుమూర్తులయినట్టియు మాకార్యకరి కేమి- మన దేవతాసముదయములకెల్లను నొజ్జయైనట్టియు,

విదూ—వ్రాయడము మాత్రము చేతగానట్టియు—

ఇంద్రు—కళానిధిమాత్రసహాయుఁడై యీ సుధర్మాపీఠమునకు సేవ చేయుటలోఁ దసతలయు గడ్డము నెఱసినట్టియు నాంగీరసుం డీసభకు సధ్యక్షుఁడగుట మాకెంతయు సంతోషము. సభాసదుల యనుమతికై యెదురుచూచుచుంటిమి.

విదూ—అంతయును బాగేగాని లోకము వంచకులనే నమ్మును. ఇంత తెలిసిన బృహస్పతియే అంతఃపురద్రోహియగు చంద్రుని వెంట వేసికొని తిరుగుచున్నాఁడు.

భృగు—నీమతము నాకు సమ్మతమే.

చంద్రు—తమ యభిప్రాయమును నేను బలపఱచుచున్నాను.

బృహ—(లేచి) శచీమనోభిరాముండయిన సుత్రాముండు కోరుట చేతన్కువలయమనోహరుండును సుధాధాముండు నైన సోముఁ డామోదించుటచేతను నరికాల సెగ కన్నుగల భృగుండు సమ్మతిని జూపుటవలనను వ్యవహారమున నెట్లున్నను—వయసున నేను పెద్దనగుటచేతను సాహసించి నేనీ యగ్రాసనాధిపత్యమునకు నొడంబడుచున్నాను. ఒప్పుకొంటినని భారమంతయు నాపైననే వేసెదరేమో సుమా! నన్నీపీఠముపైనుంచి కార్యక్రమమునంతయు మీరే నడుపుకొనవలెను. చంద్రా నీయంద

చూచుకొని యధిష్టించుచున్నాను. ఏదెట్లు నడచినను భార
మంతయు నీదే.

విదూ—ఇప్పుడేమి! మీ సంసారభారము చిన్నవాడే వారిపైఁబడినది.

చంద్రు—భయపడెదరేల మాటమాటికి మీరు. కలము పోటు నాది.

బృహ—(సింహాసనము నధిష్టించును. అందరును యథాస్థానములు చేరుదురు) నేటిసభలో చర్చింపవలసిన యంశమొక్కటియే. లేఖరీ! వచ్చి యీదరఖాస్తును చదివి వినిపింపుము.

లేఖరి—అయ్యా! దరఖాస్తునంతయును చదువవలయునా? పై పొరటను మేము వ్రాసిన సారాంశమును చదువమందురా?

బృహ—ఈకట్ట మిక్కిలి పెద్దగానున్నదే. ఆ సోదెయంతయు నేల. సారాంశము మూడుముక్కలలో పూర్తిచేయుము.

లేఖరి—నర్మద యొక కన్యక. ఈమె కన్నెప్రాయముననే మృతినొంది స్వర్గము చేరినది. గుణవంతురాలనుటకు సందేహము లేదు. ఈమె చేసినది యేవిధమైన దుష్కృతమును లేదని యీమె చిత్రగుప్తునివలన పొందిన యోగ్యతాపత్రము నిందుపొందు పరుపబడియున్నది. ఈమె పాతివ్రత్యమును గురించి యొసఁగబడిన యనేక పతివ్రతల యభిప్రాయము లిందు సంపుటీకరింపఁ బడియున్నవి. తన్ను పతివ్రతలలో నొకతెనుగా నంగీకరించి యనుజ్ఞ దయచేయించఁగలందులకు దేవరవారి ఘనమును మిగులవిధేయురాలయి త్రికరణశుద్ధిగాఁ బ్రార్థించుచున్నది. (అని చదివి కూర్చుండును).

బృహ—ఇందుకు సమ్మతినిగాని యసమ్మతినిగాని సూచించువారు తమ యభిప్రాయములను దెలుపవచ్చును.

గౌత—(లేచి) అగ్రాసనాధిపా! సభ్యులారా! నాకుగల లోకానుభవమున నేవచించు వాక్యములను సావధానులరై విందురని తలంచి యారంభించుచున్నాను. ఇందు ముఖ్యమైనవి మూడంశములు గలవు. ఒకటి ఆమెగుణవంతురాలనుట యెల్లరు నామోదించిన

విషయమే. ద్రౌపది - ఆమె యాచరించిన దుష్కృత్యమేమియు
లేదని చిత్రగుప్తునిచే వ్రాయఁబడిన యోగ్యతాపత్రము దాఖలా.
దానికిఁ దిరుగులేదుగదా. ఈ రెంటను వేరుగఁ జర్చింపఁ బని
లేకయే తెగవేసియున్నవి. ఇఁక మూడవదే కొంచెము చర్చింప
వలసిన విషయము. ఈమె యవివాహిత పతివ్రతయని చెప్పు
టకు వీలులేదందురు. దిగక లోతును, తినక రుచియును నెఱుఁగ
రాదను వాదము ప్రతిబంధకమగును. దానిని నేనడ్డుకొనుచు
న్నాను. ఎఱుఁగవలసినదియే నానమ్మకము. దానికి దృష్టాంత
ములు గావలయుననఁ బొంబడితో మిశ్రితియున్నవి. మనదనుక
నేల? మానవులే దీనిని సమర్థింపఁ జాలియున్నారు. చూడకయే
స్పర్శమువలననే గాలియున్నదని గ్రహించుటయేగాక వీనికి
పశ్చిమోత్తరములకు మధ్యనుండు మూలనివాసమనియు
గ్రహించి ఈ దిక్కునకు వాయవ్యమను నామకరణ మొనర్చిరి.
వాయువు గంధమును వహించువాఁడు గనుక వానిపట్ట
ణము గంధవతియని గ్రహించిరి. ఆయన భార్యలు అంజన స్వస్తి.
అంజన యనగా వేగముగలది. ఇతఁడు వేగమును భరించుటచే
అంజనా భర్తయనియును, స్వస్తి యనగా స్థిమితముగా నుండుట.
ప్రాణములను స్థిమితముగానుంచుటవలన నీతఁడు స్వస్తికి భర్త.
యనియు గ్రహింపఁగలిగిరి. ఈయనను పృషదశ్వుఁడు. అనగా
నీటిబిందువులను మోసికొనిపోవువాఁడు. ఈ పృషతపదమునకే
పెద్దదుప్పి యని యర్థముండుటచే ఈయన వాహనము జింక యని
కూడఁ దెలిసికొని పెద్ద యాకాశపురాణము నల్లివేసినారు.
ఇదేమాదిరిగా నధిదేవతల నందరను గురించి చరిత్రలు చిత్రించి
నారు. ఇదియేమి! అదియేమి! ప్రకృతిరహస్యములన్నియు నిట్లే
దూరదృష్టిగలిగి యోచించి పురాణనిర్మాణ మొనర్చినారు.
పడిపార్లమెంటు రూల్సు ఆడిపార్లమెంటు వారికేగాని యిత
రులకు తెలియనట్లు పురుషులమైన మనకీ స్త్రీ విషయములు
దుర్గ్రాహ్యములు. స్త్రీలైన మొదల వారిసంబంధమైన నూతన

కవయములైనను ననుభవము వలన నెఱుంగనేర్తురు. అట్టి సమావేశ మొకటికూర్చి నిర్ణయించవలయును. కాని ఈవిషయ మంతవఱకుఁ బోనవసరము లేకుండనే తేలిపోయినది. ఈమెను పతివ్రతగా నామోదించి యనేకమంది పతివ్రత లొసంగిన యదభిప్రాయము లున్నవని శేఖరియే చెప్పి యున్నాఁడు. స్త్రీల విషయములు వారియోగ్యతలు వారికంటె మనకెక్కువ యేమి తెలియఁగలవు. కాన నీమెను పతివ్రతలలోఁ జేర్చుటకు నేనామోదించు చున్నాను.

విదూ—అగును. నీయనుభవమునుబట్టి నీవట్లే యనుకొనవలయును. లేకున్నఁ బోసికొని ద్రాగ నీళ్లున్నవా?

చంద్రు—(బల్లవద్దకు వచ్చి) పెద్దపీఠస్థులయిన గురువులవారికి వందనములు. సభ్యులకెల్ల. వందనశతంబులు. మంచిగుణములకును, పాపరాహిత్యమునకును, పాతివ్రత్యమునకును, సంబంధమేమి యును లేదు. పతివ్రతయనగాఁ బతియే వ్రతముగాఁగలది. కన్యక యననేమి? పెండ్లికానిది. పెండ్లికానివారికి పతులున్నను పరిగణింపఁబడరు.

విదూ—వినండి. వినండి. (అందరును నవ్వుదురు)

చంద్రు—అట్టియెడ నున్నను లేకున్నను లేదనవలసినదే. పతియే లేనిది పతివ్రత యెట్లగును? వెంట్రుకలుండిన నేకదా యేకొప్పు పెట్టినను. పాతివ్రత్యమునకుఁ దలలోఁక లెఱుగని కన్యక పతివ్రత యెట్లగును? కాన నొప్పుకొనుటకు వీలులేదనియే నా యభిప్రాయము.

ఇంద్రు—(లేచి) నేను నీ విషయమునఁ జంద్రునితో నేకీభవించు చున్నాను.

శేఖరి—(లేచి) నాయభిప్రాయమునుగూడ పుచ్చుకొందురా?

బృహ—అవసరములేదు. అడుగనిది కల్పించుకొందువేల? నీకెవ్వ రిచ్చిన యధికారము. ఏమైన గడ్డిమేసితివా? అధికప్రసంగము మానుము.

చంద్రు—అయ్యా! గురూత్తమా! తాము సెలవియ్యఁదలంచినవి
గూడ వినిపింపుఁడు.

బృహ—పతివ్రతలలోఁ జేర్పవలయునని యొకయభిప్రాయమును, కూడ
దని రెండభిప్రాయములును వచ్చినవి. నాయభిప్రాయమును
మొదటిదానికి వ్యతిరేకముగనే యున్నది. కాని యింతప్రయ
త్నము చేసిన యీమెను వ్యర్థపుచ్చుట నాకిష్టము లేదు. అట్లు
చేయుట ముందు ప్రయత్నింపఁబోవువారిని నిరుత్సాహపఱ
చుటయగును. పతివ్రత కావలయుననినయెడల వెంటనే మను
ష్యాంగనయై పుట్టి పెండ్లియాడి మంచి నడవడిగలదియై మెల
గినయెడల నప్పటి యీమె యోగ్యతనుబట్టి నిర్ణయింపఁబడు
నని చెప్పుచు నింతటితో సభను ముగించుచున్నాము.

శేఖ—అయ్యా! ఆమెమాటగాఁ జెప్పుచున్నాను. కాలవిలంబనము
సహింపరానిదని మొఱ్ఱ.

బృహ—అటులయిన నవయావనయై పుడమియం దవతరించునట్లు
చేయుదుము. వెంటనే యీమెకు మిక్కిలి కోపదారియగు
నొక కుష్ఠి బ్రాహ్మణునితో సంబంధము కుదురును. వాని
వరిత కాగి పతివ్రత యని చెప్పించుకొనిన నీమె పతివ్రతగా
నంగీకరింపఁ బడును.

శేఖరి—మహాప్రసాదము. (అని చేతులు కట్టుకొని యుండును.)

బృహ—ఈ ముక్కలు క్లుప్త లిపిలో వ్రాసియుంటివా?

చంద్రు—అట్లే సిద్ధపఱచితిని. దానిపైఁ బెద్దల సంతకములు చేయిం
పుఁడు.

విదూ—ఎవరివి? (గురువు దిక్కై) మీ సంతకము చంద్రుఁడు చేయ
వలసినదే గదా.

బృహ—లెక్క వేసికొనుము. ఒకరికొకరిని చెప్పుచున్నాను. మొదటిది
సర్వసాక్షియును త్రిమూర్తి స్వరూపుఁడు నగు సూర్యభగ
వానునిది.

విదూ—సహస్ర కరములను వ్రాయఁగల చతురుఁడేగాని మనకుఁ జూడ కన్నులు లేవు. చేసినంతవఱకు మసిచేసి వేయును.

చంద్రు—రెండవది ?

బృహ—జీవనాధారమగు వరుణునిది.

విదూ—అయ్యది నీటివ్రాతే.

చంద్రు—తరువాతి?

బృహ—సర్వాంతర్యామి యగు వహ్నిహోత్రునిది.

విదూ—అది యెవ్వడును మీరనుటయేగాని వానిచేయించుట లేదు. చేయించిన మనకు మిగులున దేమియును లేదు. ఆయన సర్వభక్షకుఁడుగదా.

చంద్రు—అటుపైన?

బృహ—జగత్ప్రాణుండైన ప్రభంజనునిది.

విదూ—వారిచేతఁబడి మఱి మనచేతఁబడినగదా తిరిగివచ్చుట.

ఇంద్రు—(తనలో) కచ్చేరి వేళయైనది. ఈవేళ జవాను రాలేదు గాఁబోలు. నిశానియైనను వందియాభిజాత్యము గలవాఁడు మెంతకవాఁడు గనుక శేఖరినే యడిగిన మేలు.

(ప్రకాశముగా) శేఖరీ! గంటకొట్టు.

విదూ—పాపము. వాఁడెందుకులే. గంటకొట్టవలె. సమయమువచ్చిన మహామహావారి చెంపలుగొట్టవలె. నేనే కొడతాను. కాసిందు (అని గంటకొట్టును.) (తెరపడును.)

చతుర్థాంకము

౧ రంగము.

స్థలము—ఉద్దండుని గృహావరణము.

(ఉద్దండుఁ డొకమంచముపైఁ బరుండియుండును. నర్మద చెంత నుండి యుపచరించుచుండును.)

ఉద్దం—అబ్బబ్బా! ఈచలిగాలికి నాప్రాణము తెగసిపోవుచున్నవి. ఓసీ! రాకాసీ! నీవెక్కడిభార్యవే. కులమును గోత్రమును విచారించకుండ, నీతల్లి యెవరో తండ్రి యెవరోగూడ విచారించకుండ, ముక్కుమొగము తెలియక వివాహాసక్తిచే నీమెడలోఁ దాళిగట్టినందులకు నా యెముకలు విరచుకొని తినుచున్నావు. నాబ్రతుకు బండారములను బయటబెట్టి కడుగుచున్నావు. కండ్లు లేవు. కాళ్లు లేవు. కాలము తీరిన ముసలిముండనైకొడుకు. పైగా పది పుట్లరోగము. అని యేమైన దాక్షిణ్యమున్నదా? ఏమైన మమకారము చేయదమున్నదా! ముండకొడుకు వదలిన తలబరువు వదలుననియున్నది. నన్నేమో మోసికొని తిరుగునట్లున్నది. ఎవరితోనైన మాటలాడిన పోట్లుకోనీదు నావిషయమున. "అతి వినయం ధూర్త లక్షణం' అన్నవాఁడు వెఱ్ఱివాఁడా! ఏమి ఆ వగలేమపులు. ఏమి భక్తి శ్రద్ధలు. ఆ నక్కవినయములు. ఆ బులిబుచ్చకములు, ఆ మెరమెచ్చులు, ఆ నావిషయమైన స్తోత్రపాఠములు, విని తీరవలెగాని, చెప్పిన తీరునా? ఆ కంటికి కడవెడుగా నేడవడము, ఆ ఉహూఁ చీదటము, ఆ ఉహూ ఎగబీల్వడమూ చూచినవారి గుండెలు నిలువునసీరుగావలసినదే. ఆనేర్పులు, ఆవడుపులు, ఆమాటపొందికలు విన్నవారు-ఆయుక్తి నయములు, ఆముఖలక్షణములు, కన్నవారు-నిశ్చేష్టితులై నిలువవలసినదే, ఇంక నిన్నిమాటలేల?- ఇదియంతయు నొక విచిత్రప్రదర్శనము. ఆ యాయాసము,- ఆనటనము- ఇదియంతయు ఉద్దండుఁడు ఉద్దండుఁడుగాదమ్మా! వీనికి పేరు పెట్టిన 'తల్లి దమ్మా ప్రజ్ఞ' అని నన్నులోకులచే నాడిపోయించవలెననిగాని వేఱుగాదు.

పద్మ—నాథా! చెవులు చిల్లులుపడుచున్నవి. చురుకు పలుకుల నా మనంబు గాడనేసెదరేల? రామరామ! విన లేకున్నాను. చల్లని శాంతవాక్యము లాడి నాహృదయమును చల్లబరుప

రాదా? ఈ నీ దాసురాలిని కటాక్షింపరాదా? కన్నుల యింత కఠినముగా శిక్షింపకారా. నాకు మీకంటె వేఱు దైవము లేదు, మీయాజ్ఞయే నాకు శిరోమణి. మీసేవయే నాకు సంసార సాగరము దాటు నావ. మీకటాక్షమే నాకు మోక్షము. మీ స్నేహమే నా కుత్సాహము, మీయారోగ్యమే నాకు మహా భాగ్యము. మీయుల్లాసమే నాకు కైలాసము.

ఉద్దం—ఓసీ! మాయలాడీ! ఈపాఠములు మతేమి క్రొత్త పాఠములు గావు. మాట లెన్నైననేమి, నీమనసులోని దేనడక, ఉడక ఉడకని యేడ్పునందుకు నాకీహోరుగాలిలో వడక, చలిగాలికి పుడ్ల నలుపునై పరాకున్నది. కప్పుకొనుటకు రెక్కలపైకి గుడ్డైన లేదు.

ఇక నిట్లల్లాడిచావవలసిన దేనా? గతి మోక్ష మేమైనకద్దా!

నర్మ—(వస్త్రము తెచ్చి పట్టుకొని) ఇదిగో! అందికొనుడు.

ఉద్దం—(కినిపించుకొనక) ఓయిదేవుఁడా! నాకెవ్వరు దిక్కు. దిక్కు లేనివారికి దేవుఁడేదిక్కు. అనాథనాథుఁడవు. నిర్హేతుక జాయ మానకరుణాపారీణుఁడవు. నాకు నాదరువుగానా! పదునాలుగు భువనములు భరించు మహానుభావుఁడవు. నీకీదిక్కుమాలిన బక్కబావ దొక్కడక్కుడుభారమాయెనా! అయిన కానీ! నాకుఁగా నూకలెందుకుఁబోసినావు నా యాకముగునబడ్డదా? త్రిప్పివేయరాదా నాయనా.

నర్మ—నాథా! ఇదిగో! వచ్చడము కప్పుకొనుడు. ఇచ్చునది పుచ్చు కొనకయే యింతచదువుచున్నారు.

ఉద్దం—ఓసీ! దుర్మార్గురాలా! నీవుచేసినది నీతి, నేనుకూసినది బూతునా. కానరాని పలువతనమంత నీయొద్దనున్నది. కండ్లు గాననుగదా! ఆకాలువచేయందీయక పైనెత్తి కట్టినది నాకేమి మెరుక, చేతగుడ్డబట్టియే నన్నిట్లు శివములాడింతువా! చలిచే వడకి చచ్చిననునరే. వద్దు. నీవచ్చడము నాకు వద్దు. చాలుదు విక నెంతకైనఁ జాలుదువు. చేయుము-చేయుము-నీవెంతదలం చితివో యంతజేయుము. నాకేమి తలిదండ్రియా, తోడా

నార:- (సంభ్రమములో దివిటీ వెలిగించుకొని వచ్చును.)

(అతనిమాటలో కలిపి) అదియేమి-ఇదియేమి? కీడుగాని మేలుగాని అన్నియు నాడుదానివలననే కలుగుచున్నవి. కనుకనే దానిని శక్తియన్నారు. నిజమైన సామర్థ్యమాడుదానియొద్దనేయున్నది. కాని పురుషునియొద్ద నేమున్నది, ఎంత నేను మొలత్రాడు గట్టిన మగన్ననని యెగిరిపడినను స్త్రీచిత్తము పురుషుని భాగ్యమేగాని మతిగత్యంతరము లేదు.

స్త్రీ. మ:- (అసంతృప్తితో నారదునివంక తేరిపార జూచుచుండును.)

నార:- (స్త్రీద్వేషమహర్షిదిక్కై-) అహాహా! స్త్రీద్వేషమహర్షులా!

స్త్రీ.మ:- మమ్ములను మీరెట్లు యెఱుఁగుదురు?

నార:- జగద్విదితులు మిమ్ముల నోకలెతిగింపవలెనా? మీ వాక్ప్రభావము చెప్పక చెప్పుచున్నది. ఇంతమాత్ర మెఱుగ లేకున్న నిక త్రిలోకసంచారమేమి? త్రికాలజ్ఞత యననెట్టిది?

స్త్రీ.మ:- అయ్యా! మీరు నారదమహర్షులా? దయచేయుఁడు. నమస్కారము

నార-: నమస్కారములకేమిగాని యనసూయాదేవి యాశ్రమమునందున్నదా?

స్త్రీ.మ:- చిత్తము. అనుజ్ఞయయినఁ బిలుచుకొనివత్తును. నా సందేహము తీర్పరా? ఈ ప్రమాదమునకు హేతుభూతము స్త్రీయేగదా?

నార:- అవును, కామమోహసంకల్పలు. తమ యూహలు వ్యర్థములగునా? సత్యము గ్రహించితిరి. కృతయుగసంతతి. దేవతాపురుషులు.

స్త్రీ. మ. (ఆనందమును వెలువరించుచు) ఈయూహలు మాతలకాయలో నూతనముగాఁ బ్రవేశించినవిగావు. చిరస్థాయులే. వంశపారంపర్యముగా వారసభుక్తములు గలిగియున్నవే. ఇందు సంపూర్ణానుభవముగలిగియే మాతండ్రి నాకు స్త్రీద్వేషి యని నామ

కరణముచేసి యట్లుపిలుచుకొని యానందించువాడు. ఈతత్వము నాకు బాగుగా నస్తిగతముగావించి లోకానికి శక్తివంచనలేకుండ చాటుమని చెప్పి నాచే నట్లు వాగ్దత్తము చేయించుకొని మఱి ప్రశాంతముగా మరణించినాడు. అవకాశము చిక్కినప్పుడెల్ల నే నాడువారిమీఁద పగదీర్చుకొనుచునే యున్నాను. ఇది యేమిటి మా తాతగారు 'స్త్రీద్వేషహితచర్య' అను శీర్షికతో సపాదలక్షగ్రంథము ప్రకలాదర్శముతో వ్రాసినాడు. కావల యున్న మీకుఁ జూపింతును. త్రిలోక సంచారులు మీమ్మాత్ర కర్షించినదానికి గొప్ప ప్రచారము గలుగఁగలదు. గ్రంథమిమి యుఁ జెడనీయక రాగిరేకులలో భద్రపఱచియుంచినాను.

నార:- భేషు! తంత్రీతాతలకు నీవేమియుఁ దీసిపోవు. గ్రంథము సావకాశముగాఁ బరిశీలింతముగాని తొందరగాఁ బోయిరమ్ము.

స్త్రీ.ము:- చిత్తము. (అని పోవును).

స్త్రీ.శి:- (అనసూయతోఁ బ్రవేశించి) ఆమెయే తమరాక నెఱింగి యిటవచ్చుచున్నది.

అన:- (ప్రవేశించి) నారదమునిచంద్రమా! నమస్కారము. తమరాక వలన మా యాశ్రమము పవిత్రమైనది. మేము చరితార్థుల మైతిమి. అకారణ కారుణ్యమున కెంతయుఁ గృతజ్ఞురాలను. మహానుభావులు త్రికాలవేదులు త్రిలోకసంచారులు. తాము నేఁడిదేమో సంభ్రమమున దయచేసినారు.

నార:- అమ్మా! ఏమియును లేదు. వచ్చినది ప్రళయము. మహాప్రళయము — అకాలప్రళయము. ఎవ్వరు ననుకొనకుండఁ దెలియకుండ వచ్చినది. అరువది సంవత్సరములకు పంచాంగముల నొక్కమారుగా గుణించిపెట్టగల దైవజ్ఞులకు సహితము నంతుబట్టకుండ మిడిమేలముగ వచ్చినది.

అన:- అయ్యా! ఇట్లు నశించునా! లోకమెల్ల అగ్నిప్రళయము, వాయుప్రళయము, జలప్రళయము నందురు. అవి మూడునుగాక

నాల్గవదాయెది తిమిర ప్రళయము. చుక్కలును, చంద్రుఁడును గూడ కాంతి తగ్గి క్రమముగాఁ జీకట్లు దట్టమగుచున్నవి. చలియు విపరీత మగుచున్నది.

నార:- తల్లీ! ఈప్రళయము ముందు తెలియఁబడకుండ వచ్చినది. గనుక త్రిమూర్తు లాగ్రహించి దీనిని నిలిపి వేయుదమను చున్నారు. ఆ కార్యము నీవలనఁ గావలెనని నన్నుఁబుత్తెంచినారు.

అన:- అదియేమి బాబూ! నావలన నేమగు. నంతటి మహాకార్యము.

నార:- నీవంతటి సమర్థురాలవే. కానరావుగాని, నిగూఢ గర్భిత నిత్యాపు చేయవలెనన్న నెంతపనినైన చేయనోపుదువు. కాని పైవేష ముల వారివలన కార్యములగునా.

అన:- అర్థముగాకుండ నేదియో చెప్పుచున్నారు. మాకేఁ దెలియని ప్రళయమేమి. నిక్కము తర్కింపుడు.

నార:- దాపురమందురు; చల్లకు వచ్చి ముంతదాచిన సార్థకమేమి? నర్మదయను నొక పతివ్రత గలదు. ఆమెభర్త కుష్ఠివాఁడు ఆతఁడునాని సంపర్కము కావలయునని కోర నొక వారకాంతకు విస్తార ధనము నొసంగెదనని యాసఁబెట్టి యొడంబరచి నాథుని పుండ్లు గడిగి కట్టుగట్టి శుభము చేయుటకు రాత్రి వేళ నదికిఁ దీసికొనిపోయి రేవులోఁ గూర్చుండఁబెట్టఁ గనులు గనరాక నాఁడా చేరువనున్న యొకతపసి పైఁబడ నాతఁ డాగ్రహమున

గీ. కన్నుగానక పైబడి నన్నునొరసి
చీమునెత్తురు మేనికి ప్రాకి చమిరి
రోతగావించు నాతఁడు రోవుమాయు
గాత రేపు సూర్యోదయకాలమునకు.

అని శపించె. దానికాయ [illegible] సహింపనోపక సూర్యోదయమ్మె [illegible] ప్రతిశాప మొసంగె. దాన నింత ప్రళయమ్ము [illegible]ంగె. 7/75

స్త్రీ.మ:- (అవధారించి) అయ్యా! నేననలేదా ఆడుది యెంతటైన సాహసురాలనుమా! ఒక్క యనాథనాథుని జీవితమునకై లోకమునెల్ల వినాశమునర్పఁ దలఁచినది. మగవారికింత పట్టుదల యుండునా? పాపభీతి లేకుండునా?

నార:- (స్వగతము) నీపాండిత్యము పాడయినట్లున్నది.

స్త్రీ.మ:- (అనసూయ దిక్కై) అమ్మా! ఎట్లయినఁ జెప్పి వినుపింపుమమ్మా! నీపుణ్యము మాయమ్మా! మీచేతఁగాని పని యేమున్నది. మాబోటి యక్కచావనయ్య ముక్కున నూపిరి నిలుపుమా తల్లీ!

నార:- అమ్మా! నావెంటరావలయును. మిమ్ము నేనచటికి గొంపోయెదను. కాదనక యంగీకరింపుము.

అన:- వచ్చెదను. వచ్చి యేమిసేయుమందురు. ఎవరికిఁజెప్పిన నెవరు విందురు.

నార:- అప్పటి కట్టియాలోచన జేసిన నట్లుచేయుదము. నీవు సమయజ్ఞవు. నీకు నేను బోధన చెప్పవలయునా!

అన:- మానవులను దిద్దవలసినది మహాత్ములగు దేవతలేగదా! అందును మీరు దేవర్షిసత్తములు.

స్త్రీ.మ:- (తనలో) అది యట్లుండ- అబలలను దిద్దవలసినది పురుషులేగదా యనవలసియున్నది. స్త్రీలు కార్యనిర్వాహకులా! స్త్రీస్వాతంత్ర్యము నంగీకరించెడి వద్దమ్మ యొకఁడు.

నార: ఇప్పుడు మగవాండ్రు ఆడువారికి బోధన చెప్పవలయునా? అవి యన్నియుఁ గృతయుగపుమాటలు. అనవలసి యట్లనుచున్నానే గాని యిప్పుడు మగవారికే బోధనలు చెప్పఁగలరు. పాఠశాలలలో వారు, వర్తనశాలలో వారు, సభలలో వారు, సమరములలో వారు; వారులేనిచోట మగవారు ముందునకును లేరు.

అన:- (తనలో) ఇంతటి కార్యభారము నిర్వహింపఁగలనా? ఐనను పతిపాదసరసీరుహముల నాత్మనిల్పి దైవముపై భారమునైచి

దైవసమ్మతముగాన నిష్కార్యమునకుఁ గడంగఁదగదుగాక. (ప్రకాశముగా) చిత్తము నడుపుఁడు.

స్త్రీ.మ. (తనలో) అనాథబాలుఁడనయ్యును నేనును వెళ్లుదు. పర్యవసానము నెరుంగక నామనస్సు కుములఁబడదు. స్త్రీప్రభావము నీ కనులతోఁజూచి సహింపవలెనుగా (ప్రకాశముగా) నేనును వచ్చుచున్నాను (వెంబడించును.) (తెరపడును)

## చతుర్థాంకము
## రంగము ౪

(స్థలము—నీలాటిరేవునందు ఉద్దండుఁడును నర్మదయును కూర్చుండియుందురు. ఉద్దండుఁడు ఆవేదనపడుచుండును. నర్మద దీర్ఘాలోచన మొనర్చుచుండును.)

ఉద్దం: (స్వగతము) అయ్యో! అప్పుడే తెల్లవారెనా? నా బ్రతుకింతటితో తెల్లవారెనా! కన్నులులేని నాకే యేదియో కాంతి యగుపడుచున్నదే? సూర్యోదయమైనదా యేమి? అయ్యో! నాకిప్పుడే యవసానకాలమాసన్నమైనదా? మొన్న మకరసంక్రమణమునకేగదా డబ్బది తేసి కొల్లి డబ్బునిమొనిబడి పైఁబడినది. మాయింటిది యేదో యడ్డుపుల్లవేసినది అది నిలుచునా? తపోగ్ని తేజఃపుంజమువలెనున్న ఆ మునివాక్యము నిరర్థకమై అబలయై గాజులతో డిగించుకొని ప్రొయ్యివద్దఁ గూర్చుండు నాఁడుదాని మాట సార్థకమగునా? అయినను చూచెదనుగాక. తొందరయేల, ఒకరాత్రి యింతకాలమున్నట్లు తోఁచదు నాకుఁ జూడ మామామిడ గట్టియిల్లాలుగానే గనఁబడుచున్నది. లేకున్నఁ గొట్లుతిట్లుబడి యీశూప్తిముండకొడుకుతోఁ గాపురమెట్లు చేసుకొని వచ్చుచున్నది! (ప్రకాశముగా) ఏమే పలుకవేమి చచ్చితివా నితో నాకేమని నన్నిచటఁ జారవైచి నీదారిని నీవు పోయినట్లున్నదే పలుకవేమి? ఓయ్!

నర్మ:- ప్రాణనాయకా! ఇచ్చటనే యున్నాను. భయపడకుడు. ఇంకను సూర్యోదయముగాలేదు. ముందునుఁ గాదనియే నానమ్మకము.

ఒక్కచుక్కలు గుంకుచుండఁ దెల్లవారునేమో యని భ్రమించితినేగాని యది ప్రళయసూచకమైనది పోయిన లోకమెల్ల నొక్కసారిగాఁ బోవలయునేగాని వేఱుగాదు.

ఉద్దం:- అట్లయిన నిక నిశ్చయించుము. పతి గుఱితోడి చావు వందువే! నే నొక్కడనే నాతల్లికడుపు కాల్చుకొని, నానోట మట్టికొట్టుకొని నీనెత్తిన నిప్పులు పోసి పోనుగదా?

నర్మ:- మతియేమియును బ్రమాదములేదు. అమంగళము లాడకుము. అట్లాడనని యొట్టుపెట్టుకొంటివి. జ్ఞాపకము లేదా?

(స్త్రీద్వేషమహర్షియు నారదుఁడును అనసూయయుఁ బ్రవేశింతురు.)

అన:- నారదా! ఇంకెంతదూరము పోవలయును?

నార:- ఇదిగో! ఇక్కడనే యల్లంతా నగుపడుచుండుటలేదా? ఆ యగుపడువారే ఆమెయే నర్మద. అతఁడే యుద్దండుఁడు. (సమీపింతురు)

నర్మ:—(సంభ్రమమున వారినదరోఁకి ఋషులదిక్కై) అయ్యలారా మీరెవరు? మహాత్ములవలెఁ దోఁచుచున్నారు. నావందనములు గైకొని నన్ననుగ్రహింపుడు. (నమస్కరించును.)

నార:—సుమంగళీభవ

స్త్రీ.మ:-(తనలో) ఇఁకనుండి యీఁడు వారికే విజయములు గాబోలు (ప్రకాశముగా) సర్వార్థసిద్ధిరస్తు.

నర్మ:—(అనసూయదిక్కై) తల్లీ వందనము.

అన:—విజయప్రాప్తిరస్తు.

ఉద్ద:—అయ్యలారా! మీరెవరో? అమ్మా! మీరెవరో? నేను దుర్మార్గుఁడను, కోపదారివాఁడను. నన్ను మన్నించండి. నాప్రాణాల కడ్డు పడండి. నన్ను కాపాడండి. మీకు నేనేమీ ప్రతీకారము చేయలేను రెండుచేతులతో నమస్కరించు కొంటాను.

నార:—నేను నారదుఁడను. దేవర్షిని.

ఉద్ద:—ఆ! ఆ! నీవు నారదుఁడవా? నాయనా, నా యదృష్టము పండినది. ఇక నేను బ్రదికినట్లే. దేవర్షిసత్తముఁడవు. దేవలోకమునుండి దిగివచ్చావా నాతండ్రీ నన్నాదుకొనను.

నార:—నువ్వేమియు వెరవఁబోకుము నీప్రాణమునకు నాప్రాణమొడ్డువేయుచున్నాను. ప్రాణభీతివదలి మనసు కుదుటపరచుకొనుము. (చేయిచాఁచి వానిని లేవనెత్తి) ఇదిగో! శుభజలము చల్లుచున్నాను. 'అకాలమృత్యుహరణం సర్వవ్యాధినివారణం' (అని దీవించును)

ఉద్దం:- అయ్యా! మీయనుగ్రహముచలన బ్రతికిబయటపడ్డానన్నమాట.

నార:—నీ పురాకృతము మంచిది. నీ భార్య మహాపతివ్రత. గ్రహాచారసంచారము నాపివేసినది. కాలచక్రప్రమాణము కట్టివేసినది. ఎంత యిల్లాలుగాక యింతపని చేయఁగలదా. ఇంకొక మహాపతివ్రత నీకుపకారము చేసియున్నది. ఆమె యెవరనుకున్నావు, పవిత్రమైన గంగాభవానిని పావనమొనర్చిన వరసుకళ్యాణి. నిన్నేమి చేయనున్నదో.

ఉద్ద:—అట్లయిన నాకిక తిరణోపాయము దొరికినట్లే! పిన్నా నీవడుమ నీమెమహిమ. విని నమ్మక మూఢమతిచే నదియెంత నిజములే, ఏదిలేనా నీలివార్త యనుకొంటిని. ఇప్పుడు మహానుభావుఁడవైన నీవలన నిరుకుపమెఱింగితి. ఆతల్లిని చూఁచి ధన్యతనొందఁగన్నులు లేవుగదా.

నర్మ:—తల్లీ! కాముపచ్చిన కార్యమేమి? ఈమందభాగ్యురాలితోఁ దమకేమి పనిపడినది. సెలవిచ్చి నన్ను ధన్యురాలిగా నొనర్ప వేడెదను.

అన:—అమ్మా! కార్యమింతవరకు వచ్చినది, లోకము లంతర్దించునను భీతి జనించినది. ఇపుడేమిచేయ నిర్ణయించినావు.

# సతీ అనసూయ

## పంచమాంకము.

### రంగము 1.

(వనమునందు శివ కేశవ నారదులు.)

ఈశ్వ—(విష్ణువు దిక్కై) త్రిమూర్తుల మగు మనము కూడ నాడు వారిమాటలు పట్టుకొని తిరుగవలసినదేనా?

నార—తిరుగ కేమి చేయుదురు! త్రిమూర్తులయిన నెవరి కెక్కువ! విధికి నెక్కువయా! విధి యనుల్లంఘనీయమని మీరే సెల విచ్చితిరే! మఱల నిట్లనెద రేల?

విష్ణు—(నారదుని మాటలు చెవినిఁబెట్టక) విశ్వనాథా! ఏమి చేయుదుము? పోక తప్పదు. ఏవిధముగ నైన మన మిప్పట్ల వీరికి గర్వప్రాయశ్చిత్త మొనర్ప వలయును. కాకున్న వీరు మన మాటపట్లలో నిలువరు.

నార—మాటపట్లలోనే! అది యెన్నటికిని జరుగనేరదు. ఇట్టి గర్వ ప్రాయశ్చిత్తము లెన్నేని గానిండు. అప్పటి కప్పుడే మఱతురు. ప్రకృతి మార్చుట కేరికిఁ దరమగును. శునకపుచ్ఛము నెన్ని సారులు గట్టివిడిచినను దాని వక్రస్వభావమును విడుచునా?

(నారదునిమాట లెవరును జెవినిబెట్టరు)

ఈశ్వ—శ్రీహరీ! ఏమి చెప్పుదును! నాయగచాట్లు మఱిమఱి విపరీతముగా నున్నవి. కడుపులోని మాట నొకరితోఁ జెప్పుకొనుట కయిన వీలులేదు. బంధువుడవును బ్రియమిత్రుఁడవును గాన వెలువరించుచుంటి.

గీ. విశ్వనాథుండ నని పేరు పెద్దగాని
కట్టుబట్టయు వసతియుఁ బొట్టకూడు

లేక చెంతఁజేయిబట్టి తిరిపెము నెత్తి
యొడిగి పైశాచనముఁ దల యొగ్గియుంటి.

నార— (తనలో) పాపము! నాకును జాలిగనే యున్నది. ఏమిచేయఁగలను? నాకే కూడు నీళ్ళు లేక మర్త్యలోకమునందలి పైరివేట్లవలె వారిజుట్టు వీరికి, వీరిజుట్టు వారికి ముడివెట్టి తగవులతో కాలక్షేపము చేయునే నేమి సహాయము మొనర్పఁగలను. ఉన్నవారి కీయబుద్ధి యుండదు. బుద్ధిగలవారి కీయనుండదు.

విష్ణు—(తనలో) "జాతస్తా దశమగ్రహ"మనుట నిజము. ఈతఁడు నన్నుఁ జూచినప్పుడెల్లఁ దన మధ్యాహ్న దరిద్రము సంగతిఁ దెచ్చుచుండును. ఎవరికర్మ కెవరుకర్తలు? ఇతని దారిద్ర్య విచ్ఛిత్తికి మార్గమున్నదా? వీనికిచ్చిన మాత్రము లాభమేమి? బూడిలోఁ బోసిన పన్నీరుగదా! ఇచ్చిన నిచ్చిన యందమున్నదా? ఇట్లు తలవిరియఁబోసికొని సంచరించు వారికి సిరి యెట్లు నిలుచును? అంతవిరివిగా వ్యయమొనర్చిన నాకు మాత్రమింత కక్కుఱ్ఱవగతి పట్టదా? ఇదిగాదు మార్గము. నాకు మాత్రము నీకంటె నేమి వైభవమున్నదని నచ్చఁబలికిన గాని నాకీతని బాధ తొలఁగదు. (ప్రకాశముగా) ఈశ్వరా! ఏదో నాలుగుడబ్బు లున్నవన్నమాటయే గాని నా యైశ్వర్యము మాత్రమేమంత వెలిఁగి పోవుచున్నది.

గీ. సిరి గలాడని లోకులు చెప్పుకొందు
రందుకే భీతి నట్టిటియందు పాము
పడగనీడను నివసించి పత్తినక్క
వేషధారుఁడనై యుండ విధియు వ్రాసె.

నార—(తనలో) తాత నేర్పేమి! ఎంతయొదుపుగా సమాధానము చెప్పినాఁడు. ప్రాత బిచ్చగాఁడు గనుక బహుచమత్కృతిగ నముగ మొదలుపెట్టినందులకుఁ దుదవెళ్ళనీయకుండఁగనే నోటికిఁ గట్టు గట్టినాఁడు. కనుకట్టు గారడియే యనుకొంటిని. తాతగారు వాగ్బంధన విద్యలోఁగూడ నుత్తీర్ణులైనవారే. ఏది

కొట్టయిన మన్నవాఁడవస్థ లోకవిధము. లేనివారి యొక్క-ట్లాక కెఱుఁగుదురా. కడుపునకుఁ గూటికిఁ గట్టుబట్టకు నున్న కడమ తిప్పలెన్ని యంత (ప్రహసనములు గాత్రు (ప్ర)కాశముగా) తాతా! స్త్రీత్వము జాలకష్టగాఁడ వై నీమా ప్రాణములకుఁ దెగఁబడి యఘాతజలమైన యపారసంసారవారాశిని మునిఁగి వచ్చితివి గదా. ముప్పదిమూఁడుకోట్ల దేవతలు ముప్పదిమూఁడుకోట్ల రాక్షసులు మహాయజ్ఞాలని కవ్వపు కొండను పిపురాయిడి కోప్పి మోఁచితివిగదా! జలధిలోఁబడి యాదుమఁ గోమ్రువఁ బుద్దిభారము వహించితివిగదా. లోకములన్నియు నొక్క కాలికిఁ దెచ్చిన బ్రహ్మరాక్షసునితోఁ బ్రాణాపాయమునకు పోరాడితివిగదా. ఇంకను నటకుడవు గనుక కాలము నెట్టుకొని పుడమిఁ గలవాఁడ వనిపించుకొను చున్నావు.

ఈశ్వ—(తనలో) ఈతని నేమైన నిమ్మందునని గాఁబోలు కదుంగడు దూరాలోచనతో మాటలాడుచున్నాఁడు. ఛీ! ఛీ! అయిన వాని గడుగుటకంటె కానివాని కాళ్ళు పట్టుకొనవలె మేలు. అందును నీ పిసినిగొట్టు పీనుఁగువా! ఇఁక నా యొండి లేములల నెఁగని నీతని యొద్దఁ దలపెట్టకుందునుగాక. బంధువుఁడని తల పెట్టినందులకు ముందునకును తెలిసికొను బుద్ధివచ్చునట్లు ప్రత్యుత్తర మిచ్చినాఁడు. అయిన నెత్తిన ప్రసంగము సాంతము గానీక నింతటితో నాపిన రసాభావమగును. కాన వేఱొక విషయమునకు మరలించుకొని పోదఁ గాక. (ప్రకాశముగా) మామా! నాకొక్క దరిద్రబాధయే గాదు. అష్ట కష్టములు నను దిన దినచయములుగానే యున్నవి.

గీ. కొండవంటి పట్టము నాకు నుండ నేమి
అరవఁగాని యాలికిఁ ఱక్క యలవటించి
పగము నాదుదియై పడి చచ్చినట్లు
లింగమై యుంటి నారూపు గంగ గలియ.

గీ. సర్వమంగళ పార్వతీ సతి యటండ్రు
సర్వమంగళ మొనరించు కరణిదెలియ
వారల కేరి తిప్పలు వారి కెఱుకగాని
మాదితతో నొంటిని దరిద్రమునకు కెలది.

అది యట్లుండ భర్తనే దూషించుటయా.

గీ. మలి శాంకరీకలికిఁ జేదు మొసితిని
మొనసి విషదార్ల నెప్పుడు మోసెదనని
అల్పు జోపాకజని నెత్తి నిర్జితినని
నన్ను దూషించు గయ్యాళి యున్నసతియె.

గీ. ఒక్క నరునకు ననిలోన నోడితివని
దిక్కుసెడి దిగంబరుడవై తిరుగుదువని
భూతముల నేస్తమును బట్టి పోవుదువని
పతినిఁ దెగడెడి గయ్యాళి పడతి సతియె.

నార—(తనలో) అగును. పాపము గయ్యాళి పెండ్లముతోడి కాపురముకంటె సన్న్యాస ముత్తమము. అందును పట్టి మాట గయ్యాళి యైనఁగాదు. పట్టిన నొకపట్టు బట్ట శక్తి గలది.

విష్ణు—(తనలో) డబ్బుదిక్కు తొలఁగినది. ఇఁక తక్కిన మాటల కేమి లే. ఎట్లైన మాటలాడవచ్చును (ప్రకాశముగా) నా భార్యమాత్రము తక్కువేమి! ఎల్ల విషయంబులను నీ పడతికిఁ బైచేయియేగాని లొచ్చుగాఁబోదు. ఐన నాకొక విశేషయ మతిశయము. ఇది యెట్టిదనుకొనుటకును వీలు లేదు. చెప్పకొనిన నెవ్వరును విశ్వసింపరు.

గీ. రమ్యగుణసాంద్ర (శ్రీమహాలక్ష్మి యందు)
రామునకు భారముగనుండె నిమ్మగువయు
నిలుప కొంతయుఁ దిరుగోర నెలతునకు
తిరుగుబోతును నేగతి దిద్దువాఁడ.

ఆ పోయినను మంచివారి యిండ్ల గడపయావలనుండి తొంగి యైనఁ జూతుమగదా!

గీ. ప్రాఁచినోరును గరసమా నాతిగుండె
గాజుకన్నులు తాళింపు గట్టిపళ్లు
మొనతిచేతులుఁ గలవారి దండఁగాని
యుండఁబోదను కజ్జ మందమునకు

నార—అగును. తిరిగెడు కాలును, తిట్టెడి నోరును ఊరకుండునా?

విష్ణు—ఇది నాలిముచ్చు. నమ్మరాదు. వచ్చుచు మొగమును, పోవుచు వెన్నును జూపించును. ఇది నాకు రొమ్ములకుంపటియేగాని మఱియొకటి గాదు.

నార—(తనలో) అబ్బా దీనిమూలమున నన్నికలహములు, ఎన్ని ప్రళయములు, ఎన్నిదోషములు... సమస్త దుర్మార్గములకును కారణభూత మిదియేగదా. దీనిచేతనే తండ్రిని బిడ్డ, బిడ్డను తండ్రియును నమ్మవలను గాకున్నది. అన్నదమ్ములు నొకరి నొకరు విశ్వసింపరాకున్నది. భర్తవలన భార్యకు భయము, భార్యవలన భర్తకు భయము [illegible]. దీనికంటె తుచ్ఛపదార్థము వేఱొకటి లేదు. (దీనింగూర్చి యొక కవి చక్కఁగాఁజెప్పినాఁడు)

"శ్లో॥ అర్థానా మార్జనే దుఃఖం అర్జితానాంచ రక్షణే
నాశే దుఃఖం వ్యయే దుఃఖం ధిగర్థం దుఃఖభాజనం"

ఇది దుఃఖైకమూలము.

గీ॥ సేకరింపఁగ నేడ్పు రక్షింప నేడ్పు
పోయినను నేడ్పు వ్యయమయి పోవ నేడ్పు
అదిపొందలుగఁ దుదిదాఁక నంత యేడ్పు
ఏమనన పొందుకిక మఱి యీధనంబు

(ప్రకాశముగా) తాతా! నిజము నిజము. గయ్యాళి పెండ్లముతోనైనఁ గాలము పుచ్చవచ్చునుగాని నాలిముచ్చుదానితో నొక్కవాఁడైన నుండరాదు. నా కేచిక్కును లేదు. నన్ను కదలించువాఁడును పొదలించువారును లేరు. నాయిష్టము వచ్చిన తెఱఁగునఁ దిరుగుచు భగవన్నామము చేసికొనుచుఁ గాలక్షే

సిగ్గుఁ జేతుఁ లేదు నిశ్చేష్టితులును
సత్రమే విడితిరిగడి వాఁడొకండు.

ఇఁక కాపురము వల్లకాటి పట్టయేఁగదా!

నార:- మామా! అనఁగూడదుగాని, బ్రహ్మాదుల పలుకులఁ గోసిన దోషము నిన్నే బాధలఁ బెట్టక యూరకే పాపము దలఁచి వదలి పోవునా? (తనలో) నవ్వుచు నాచరించునది; ఏడ్చుచు ననుభవించునది.

విష్ణు— నాకొడుకు కింతకంటె నోలికించినదేమి? నాబిడ్డలే బుద్ధిమంతులైన సంసార మింత హీనస్థితికి వచ్చునా!

గీ. తెలియ ఛాందసుఁడొకఁడు డొడల్ దెలియరాక
పాంధులను గొట్టి యాడిక బడలివాఁడొ
కండు కొడుకులు నేటిలోఁ గాపురంబు
నేమిసెప్పుదు హరహరా! యీశునంబు.

గాని బ్రహ్మ యింకను రాలేదు. అదియే తపోవనము. అత్రి మహాముని యాశ్రమ మల్లంత గనుపించుచున్నది. అతఁడు వచ్చునంతకు మనమిందే నిలువవలయును.

నార— (విష్ణువుదిక్కై) నేను తెలియక యడుగుచున్నాను. మామ నీ కేమగునా?

విష్ణు— తెలివితేట లెక్కువైనవేమిరా. చదువవైచిన నున్నమతి పోయిన దన్నట్లున్నదే. పెద్దలెగసన, బుద్ధి దిగసన. కలహములు సృష్టించుటలోఁ బాండిత్య మెక్కువైన కొలంది వావివరుసలు కూడ మఱచిపోవుచున్నావా?

నార— (తనలో) ముగురమ్మలకు ననసూయతోఁ గలహము కల్పించితి ననిగాఁబోలు. మనస్సులోని కక్కు నీ విధముగా వెడలఁ బోసినారు. (ప్రకాశముగా) తెలియకేమి! అట్లయిన మామకు నీ వే తగుదువు?

విష్ణు— మామను.

నార— (తనలో) నేనింతమాత్రి మెఱుఁగనని మఱుఁగు పెట్టుచున్నాఁడు. (ప్రకాశముగా) అంతమాత్రము తెలియకగాదు. గంగమ్మత్త (గాలిక పొరలుచు) ఆఁగూడదుగాని సముద్రునకును ఈశ్వరునకును (పళ్ళునమలుచు) ఉన్న-డి-గ-దా! సముద్రుని కూఁతురు నీకెట్లు సరిపడును. ఈవరుసను బట్టి చూడ మామామ నీకు మామగాలేదా? ఛీ ఛీ! యేమి వరుసలివి.

ఈశ్వ— అత్యుక్తుఁడా! దేవతలమైన మాకీ వావివరుసలతోఁ బనిలేదు. అదియంతయు మానవులకే. ఇప్పుడు వారుఁగూడ వావివరుస లంతగాఁ బాటింపకయే సంచరించుచున్నారు. కాకున్నను మానవులకును మనకును నెక్కడి సామ్యము. వారు మర్త్యులు; మనము అమర్త్యులము. వారన్నహారులు, మనము అమృతాహారులము. వారి యాచారములు మనకు గిట్టవు. వారుఁగూడ మనలోకమునకు వచ్చినపుడు వావివరుసలు పాటింపకయే విహరించుచున్నారు. బావమరదు లిద్దరు సోమయాజులై దివిఁ జేరిరేని వారికి రంభ యేమగుచున్నది? తండ్రి కొడుకు లిద్దరు రణమరణము నొందిరేని వారల కేమివరుస యగుచున్నది? దీనినిబట్టి యూహించుకొనరాదా. ఆయగత్యము మనకు లేదు. ఇంకను నీకుఁ దెలియదు గాఁబోలు. నీతల్లి నీతండ్రి కేమివరుస.

నార— (తనలో) నానోట నీమాట యేమిచెప్పునో? తెలియనట్లు నటించెదను. (ప్రకాశముగా) ఆఁ. ఎఱుఁగుదును. భార్య

ఈశ్వ— నీకుఁ దెలియదులే. కూతురు

నార— రామరామా! అనరాదు వినరాదు! మానవుల పనియే యింతకన్న చాల యుత్తమముగా నున్నది. దేవుఁడా! నాకు నీపాడు వరుసలు సరిపడకయే వివాహమే వలదని భీష్మించుకొంటిని. ఈ యొక్క విషయమే కాదు. దేవతలస్థితి నాకేమియు బాగుగాలేదు. త్రిలోకసంచారిని గనుక నాకెవరి స్థితిగతు

లెట్టివో యెఱుఁగ వచ్చినది. కూపస్థ కూర్మములవలె నొక చోటఁ బడియుండు వారికి నేమి యెంతు వట్టును. దూరపు కొండలు నునుపన్నట్లు లేమియు నెఱుంగని మనుష్యమాత్రులు తోక తొండముల నెఱుఁగక దేవత్వము మహాఘనమని యెంచి, దానికై యెంతటికి లేని యాయాసముఁ దెచ్చి పెట్టుకొని తపించుచున్నారు. వారిది వట్టి పిచ్చి భ్రాంతి. ఇందలి ఘనత మృగతృష్ణల యందలి జలమువంటిది. నిప్పుకణికన్ను మణిదీప మనుకొనుచున్నారు. పేరుగొప్ప యూరుదిబ్బ యగుటఁ దలంపరు. దేవత్వములోని ఘనత దేవతలకే యెఱుక. అమర్త్యత్వములోని యగచాట్లు మాకే తెలియును కాని యెన్నాళ్ళకును జావక కుంటుకుంటి మంచముఁ బొడుగులై దీర్ఘవ్యాధిచేఁ బచ్చియుఁ జావని చావుగా యున్నవారి యునికి బాగుగఁ బరిశీలించిన మానవులకును గొంచెమేని యెఱుకయే యని నానమ్మకము. ఇదియేకదా దేవతల సుఖము.

గీ. కన్నుమూత పడక కాలు నేలానక
యింత కూడుదిను నదృష్టమేని
లేక, బాధలు పడలేక చావనకును
మొగమువాచి యిట్లు పొగులుచు గద.

పాపము! మానవుల తలంపులు నాకు బహువిచిత్రముగా నుండును. ఈ స్వర్గమునందలి మందాకినీ నదిలోని తామర పువ్వులే కనకంబటు! "ప్రవాహోదకేన శ్రేష్ఠః" అని యెఱిఁగి యుండియు వేగములేక నిలువవైయుండు నీ ప్రాచీనీటి దిగుడు బావిని బ్రహ్మాండముగా వర్ణించుకొనుచుందురు. తల్లి దండ్రి లేక బుట్టినదియు, వావివరుసలు లేక సంచరించునదియు, మానమమ్ముకొని జీవించునదియు ప్రాతపురాణమునగు రంభను తోడి భోగము చెప్పగిప్పరాదట. అనువ్రతలగు భార్యలతోడి పొందు రోసి, దీనికొఱకై యజ్ఞములు సల్పుచున్నారు. రణ భూములఁ బ్రాణములు తృణప్రాయములుగా విడుచుచున్నారు.

మానవులు పతివ్రతలగు భార్యల వదలి సోమయాజులై తపించుటలు, కొరటి కల్పకము నొల్లక యడవితుమ్మ నాసించుట కాదా! ఇంకను వారి భ్రమ లనేకములు గలవు. ఇవి పరమ రహస్యములు. విశేషించి దేవరహస్యములు. మాబోటి దేశ ద్రిమ్మరులకుఁ గాని యొరులకుఁ దెలియరావు.

విష్ణు—నారాయణా! నీయుపన్యాస మైనదా? ఇంకను మిగిలియున్నదా? ఇట్టి మెట్టవేదాంతములను మానవులకు బోధింపఁ గడఁగితివేని మనకొంప నీకు కుమ్మనుమా. ఇంకను వారు స్వర్గ సౌఖ్య కాంక్షచే యాగములు సల్పుచుంటనే యింత హావిస్సు (బూడిద) భుజించుచున్నాము. ముందరి విస్తరి బోర్ల ద్రోయకుము. నీ జ్ఞానము గట్టుఁ బట్టినట్టు లున్నది. ఇట్టివారు లిచ్చుటఁ గూసినం గూఁతివి గాని మఱిచెప్పుటను నోరు కదపకుము. ఈ రహస్యము తెల్లమైన ముక్కోటి దేవతలును రూపు మాసిరన్న మాటయే. స్వర్గలోకము పాడుపడ్డట్టే. ఇది మఱి యేరితోడను బలుకనని నాపై నానపెట్టుము. (అని నారదుని నదలించుచుఁ బలుకును.)

నారద—(చేతిలోఁ జేయివైచి) నీతోడు నేనిక నీప్రసంగము తేను. కోపము చల్లార్చుకొనుము, పొరపాటున నా వైరాగ్యమును మీకుఁ దెలిపితిని. క్షమింపుము.

విష్ణు—ఈశ్వరా! వీనితో నేమి. ఆతిన్నెపైఁ గూరుచుందము రమ్ము.

నారద—తాతా! మామా! నాకు సెలవు. నాయనగారు ఛాందసుఁడన్న మాట నిజము. బహుజాడ్యము పెండ్లిసదకలు నడుచుచు నే రాకాసిని సృష్టించి యేలోకములు పాడుచేయుటకో యాలోచన చేయుచుండును. త్రోవ నదురైనఁ దొందరచేసి పంపుదును. నాకు సెలవు.

విష్ణు—నారాయణా! నీవు పంపినను మానాగే! పంపకున్నను మానాగే! తెలుపున సెవ్వరి తెలుపునకుం బోయి తెనిపోని తగవులఁ గల్పించుకొనక వేగము పొమ్ము.

ఈశ్వ:- నీకొఱకై తొందరపడుచు వేచియున్నారని చెప్పి తొందర చేయుము. లేకున్నఁ గష్టము. కాలువలె నడుగులు లెక్క- జేయుచుందును.

(నారదుఁడు నిష్క్రమించును.)

(తెరపడును.)

## పంచమాంకము

### రంగము ౧.

(తెరయెత్తగా యతిరూపములతోఁ ద్రిమూర్తులుందురు)

ఈశ్వ— మీ స్థితిఁ జూచి నాకు మిక్కిలి జాలిగ నున్నది.

గీ. నేను సన్యాసినైన నన్నికను రాదు
బొడ్డున జలంబుతోడను బోడమునీవు
కడుపు జాళువా పైఁడి బొక్కసము చేసి
నట్టి పరమేష్ఠి యిటులౌట నక్కజంబు.

విష్ణు— వేషధారికి నాకు మాత్రమేమి? ఎన్ని వేషములు వేయక నాబ్రతుకు గడ్వదే యేమైనది. ఇల్లలుకగనే పండుగైనదా!

బ్రహ్మ— పూజ్యత లేక మూలబడిన నేనుమాత్రము సన్యాసిని గానా! వేషము వేసిన మాత్రమున నే సన్యాసి నైతినా! కాకున్న నాకులేని దేమి? సన్యాసిలోకమునకేగా నేను ప్రభువును.

ఈశ్వ— పూజ్యత నీకు లేకున్న నేమి! నీభార్య కెల్లలోకములను పూజ్యత గలదుగదా.

బ్రహ్మ— ఆఁ అయ్యా! లేలేమి! లాలను జేసి నన్ను మూలను గూర్చుండబెట్టి, తగుదునని తాఁదలవాకిటఁ గాపురమున్నది. అది మొతకైనం దగినదే. దాని నోటిధాటికి జంకియే నేను తగ్గియున్నాను.

విష్ణు— "స్త్రీబుద్ధిః ప్రళయాంతకి" అన్నట్లు ఆడువారి మాటలు పట్టి వచ్చిన మనగతి యేమగునో గదా. అనసూయాదేవి పరమ

బ్రహ్మ— వారి కలవి గాకయే గదా పీసంపుట.

విష్ణు— అలవిగాక యేమి! వారి చేతులలోని కీలుబొమ్మలమై మనము వారెట్లాడించిన నట్లాడుచుండుట లేదా.

బ్రహ్మ— (తనలో) ఇది నాకే తగివచ్చినది. అనసూయకు. పెద్ద వారేగాని తనను మాత్రము రొమ్ములపై నెక్కి త్రొక్కుట లేదా. ఎవరికున్న వంకలు వారికున్నవి. ఎవరిని వారు పరిశీలించుకొనక నెదుటివారి లోటుపాటు లెంచుట సహజమే. తన తప్పు తాఁదెలిసికొనుట బ్రహ్మకైనఁ దరముగాదు. (ప్రకాశముగా) ఈ చాటువుల కేమిగాని మతి ప్రకృతము విచారింపుడు.

విష్ణు:— ఇఁక ప్రకృత మేమున్నది. అమ[illegible]కదుష్టం బుట్టి యయిన మన యీ దురంతము నంతము నొందింతము పదుండు.

ఈశ్వ:— దీనఁ దీర్ఘము స్వార్థముగూడ నొనగూడు. వారిమాట చొప్పున వచ్చి శక్తిత్రయమును గర్వభంగ మొనర్చిన వారము నగుదుము. పతివ్రతా స్థసంధయులమై పావనతఁ గాంచిన వారము నగుదుము. ఇంక నింతకంటెఁ గావలసిన దేమున్నది. సజ్జన దర్శనము సర్వాభీష్ట ప్రదాయకము గదా.



# సతీ అనసూయ

ష ష్ఠాం క ము

రంగము—1

(తెర యెత్తఁగా అనసూయయు వనప్రియయు నుందురు.)

అన—ఉబుసుపోవఁ బెత్తి ముద్దాడ నొక్క ముద్దు బిడ్డయయిన లేక పోయెనుగదా. నేనెంత మందభాగ్యురాలను. అట్టి నోములు నేను నోచియుండలేదు గాఁబోలు. కొలఁది నోములు నోచి గొప్ప ఫలములు కోరినచో నెచ్చటనుండి వచ్చును?

సీ. పాల కేడ్వఁగఁ గొంత బ్రభవింపఁగను కందుఁ
బొత్తిళ్లలోఁ జూచు పుణ్యమునకుఁ
ప్రాకుచుఁ జనుదెంచి పైఁబడు బిడ్డను
నెత్తి ముద్దాడు సదృష్టమునకు
దప్పటడుగు లిడుచుఁ దనవెంట నంటెడు
బాలు నక్కునఁ జేర్చు భాగ్యమునకు
వచ్చిరాని ముద్దుపల్కులు కర్ణప
ర్వముగా వినఁగల సత్ఫలమునకును

గీ. కాళ్లఁ జిరుగజ్జియలు మ్రోవ గదిసి తనకుఁ
గాళ్ల కడ్డమువచ్చి పోకడలు వోవు
ముద్దు పసివానిఁ గని పెంచు సుకృతమునకుఁ
దల్లి తొల్లి యొనర్చు వ్రతంబు లేమొ.

అట్టి తల్లికి పరమ భాగ్యవంతురాలగు తల్లికి నోచి పుట్టిన తల్లికిఁగల పరమానందము నిర్భాగ్యులగు నాబోంట్ల కెట్లు కలుగును? అట్టివారి కెంత లే[illegible]యైననేమి? ఎన్ని యిక్కట్టులు వచ్చిననేమి? అవి యన్నియు బిడ్డలను జూచినపుడల్ల నెప్పటి కప్పుడే ప్రాతవడి మఱపునకు రాకుండునా! కన్న

గల్పించితినని పరితపించని దినము లేదు. గడియలేదు. ఉన్నవారి పొత్తులో ళ్లట్లున్నవి. లేనివారి యేడ్పు లిట్లున్నవి. లేనివారికి లేదన్నచింత యొక్కటియే. ఉన్నవారి తిప్పలిన్ని యన్ని యనరాదు. పుండని, బూచియని, రోగమని - లట్టని - పోకిరి యని - పోచుకోలని - చదువురాదని - పెండ్లికాలేదని - నోచ్చిరని - చచ్చిరని యిన్ని యేడుపులు.

అన—ఓసీ! అవ్యక్తబాలా! కొంతసేపటి చేఁబ్రాడంత దండకము జది వితివి గదే. ఇంతపాండిత్య మెక్కడ సంపాదించితివి?

వన—తల్లీ! ఎక్కువ యేమియుఁ జెప్పలేదు. ఇంకను గొన్ని సంగతులు బుద్ధిచాలక పొరపాటున జారవిడిచితినేమో! చూచినది చూచినట్లు చెప్పితిని. ఇందు పాండిత్య మేమియు లేదు. కల్పించుటకు నేను గవిత్వ మెఱుఁగను.

అన—బాలికా మతల్లికా! అనుభవము లేక యీ సంసార పారావారము లోతు నెఱుఁగ శక్తిలేరము. ఇట్టి యిక్కట్లులే లేకున్న ప్రపంచమునకును స్వర్గమునకును నేక భేద మేముండును? స్వర్గమునకు నాధిక్య మెట్లుండును? ఇట్టివన్నియు నోర్చి సహించవలెను. వలదని త్రోసిపుచ్చుటకు వలనుపడదు. ఎల్ల ప్రాపంచిక సుఖముల ననుభవింప వలయును. వానితోఁబాటు దుఃఖములు పెన్నాడుచుండును. ఈ దుఃఖముల నడచుటకే సహన మత్యవసరము. అది లేనివారు గవ్వకుఁ గొఱగారు. సహనముగల్గిన కష్టములే లేవు. ఈ ధర్మసూక్ష్మము నెఱుఁ గుము.

గీ. దివ్వె వెనువెంటఁ గ్రీనీడ తిరుగాను
సుఖము వెన్నాడి దుఃఖము జూచుచుండు
నీడలేని దివముజాడ నేరనట్లు
దుఃఖ మొందని సుఖమును దోఁచదెందు.

కష్టే ఫలి.

గీ. కష్టపడినను సౌఖ్యంబు గలుగుఁగాని
యూహించిన నిజసౌఖ్య మొందఁగాదు
పూనిక శరీర వ్యాయామమును పొనర్ప
నొదవు నారోగ్య మది లేక యుండఁగాదు.

గీ. నిష్ఠమై బ్రహ్మచర్యంబు నెఱపువారె
దివ్యతేజంబు సత్సంతతియును గాంత్రు
లేనివారికి నేఁడియు లేదు సుమ్ము
కష్టమొందక నానంద కలనఁగనరు.

గీ. తీవ్ర గ్రీష్మాతపంబుల దెబ్బసైచి
రీతిసెడ ప్రీతిదుమ్ములు రేగినట్టి
పంట పొలతియె దొలకరి కట్టుబడిన
నవరసంబులఁ గ్రొవ్విలి యానంద మొందు.

అట్లే నోచానైన నోములెల్ల నోచి సుకృతము నార్జించి సద్యో గర్భము ధరించి నవమాసములు భరించి ప్రసూతిమాయఁగాంచి అష్టకష్టములు సహించి పెంచి పెద్దవానిని గావించిన తల్లియే యిహపరంబుల సుఖించు. కాని యెల్లరకు నట్టి భాగ్యము లభించునా.

వన — అమ్మా! అట్లనుకొనుచున్నారా! ఎంత పొరపాటు. మాగుపచ్చలారని ముద్దుప్రాయముననే బిడ్డలు గాని ముదిరి యౌవనములు గడ్డములు వచ్చిన వెనుక బిడ్డలనుకొంటిరా. ఎవరో యొకరి మాటకేమిగాని ముప్పాతికో మువ్వీసము తల్లులేగాని పుత్రులు కారు.

అన — అవియున్నియు వారి వారి పురాకృతము ననుసరించి కలుగుచుండును దానికై వగవనేమగును. అందుకై సంతానాసక్తి లేనివారు పుడమి లేనివారే. అట్టివారు లేనేలేరనియే నా నమ్మకము

వన — నేనున్నాను. నేనున్నాను.

వ.—నీక్షన్మావాః? నీకీ యపక్వమైన బుద్ధి. నీబుద్ధి పరిపూర్ణాభివృద్ధి నొందు నంతదాక నీ యభిప్రాయము మారితీరదు. అదిగాక బాల్యము సంతానముపైని యెట్టుండఁగలదు. ప్రకృతినెల్ల నొక్క సారి తిలకింపుము. జంతువులును, శకుంతలములును క్రిమి కీటకాదులును, వృక్షలతాగుల్మములును నెంత సంతానాసక్తములై యున్నవో చూడుము. అంతియేగాక తమ సంతానార్థము స్వస్థి ధర్మములను ధారవోసి తుదకుఁ బ్రాణములను సహితము తృణప్రాయముగా సమర్పించుచున్నవి. బిడ్డలను సాకనేరని పక్షియగు కోయిల సహితము తన గ్రుడ్ల దొంగతనముగాఁ గాకిగూటనయిన నిలిపి పొదిగించి పెద్దవై తన్నుఁ జేరక దూరస్థము లగుచున్నను తన కన్నసంతతియని చూచి యానందమునఁ బాడుకొనుచు, కడుపునఁగన్న గ్రుడ్డులను కాకులపాలు చేయవలసి వచ్చెఁగదా, గారామునఁ బెంచుకొను నదృష్టము కాంచనైతినని కన్నులెఱ్ఱఁబడ నల్లాడి యాకసమేయుచున్నది.

కడుపుఁ జించుకొనివచ్చు కానుపయినను పరమానందమున భరించి తన యాయుష్యమును గూడఁ బోసికొని వర్థిల్లుమని బిడ్డలకై ప్రాణములు విడుచుచున్న తేళ్ళ పెండ్రగబ్బల నెండ్రకాయల సంతానాసక్తిఁ గమనింపుము,

చిలకలే వంశవర్ధనములు గాఁగల కదళీతరువును మాతృద్రోహపు సంతానమునకై తనువుఁ దొరంగుచున్నది. మ్రాకులకే సంతతిపై నింత మక్కువయుండ మానవులకు లేకుండుట భావ్యమా.

ఏకవార్షికములైన చిన్నచెట్లు సహితము-అతివృష్ట్యనావృష్టి దోషములకు నోర్చి తమ పుట్టువునకు హేతుభూతములగు పెన్నులను కంకులను, గాయలను, కన్నులఁ జూచియే నశించుచున్నవి. మామిడులు మున్నగు ఫలవృక్షములు తమసంతానాభివృద్ధికై రసవత్ఫలంబులఁ గాసి పెట్టుచున్నవి.

చేమంతి బంతి మున్నగు పుష్పలతాకుంజంబులు సంతానాభిలాషమై పరిమళ సంఘాతంబులగు సువర్ణ పుష్పరాజంబులఁ బంచిపెట్టుచున్నవి.

మల్లెలు మొల్లలు మొదలగు కొన్ని పుష్పలతలు సంతానాభివృద్ధికై తమ దేహములఁ జీల్చి యిచ్చుచున్నవి.

ఉత్తరేణులు పల్లేరులు పసుతలు పూతికలు మున్నగు గడ్డిచెట్లు సహితము సంతానాభిలాషమై కంటకావృతములగు చున్నవి ఇదియంతయుఁ గన్నులారఁ జూచి చూచి మానవులు సంతాన కాంక్ష సేయరేని మానవులనిపించుకొందురా.

వన—అబ్బా! ఇదియంతయు నెచట రోచించితివమ్మా! మందబుద్ధినగు నాకింత రోచన లేకపోయెను. అమ్మా! నీయనుగ్రహమున నీప్రకృతి రహస్యము నెఱుంగుట వలనఁ గృతార్థురాలనైతి. మాతృత్వము నశించినది. కాని యొక్క సందేహము దారిద్ర్యమునకు బిడ్డ లెక్కుడనుట నిజమేనమ్మా?

అన—అగును.

క. చీఁకటికిఁ జుక్కలట్టుల
ప్రాకటముగ లేమిడికిని బహుసంతతి యౌ
గాకేమి! వాన సేగియు
నేకడ సంతతిని లేమి యిత్తుహిఁ గలదే.

## షష్ఠాంకము

### రంగము 2

స్థలము: వైకుంఠము (గౌరి, లక్ష్మి, సరస్వతులు మంతనమున నుందురు

గౌరి—చిట్టిలుక గండుబిల్లుల నెదురించుచున్నది. మానవాంగన మహాశక్తులపైఁ గత్తిగట్టినది. మనగౌరవమును సర్వమును హరించినది. మనప్రయత్నములన్నియు వ్యర్థములయినవి. శక్తిత్రయ ప్రయుక్తా సూయా ప్రయోగము అనసూయపై నిరుపయోగమైనది.

నార—బోధించున దేమున్నది. పోయి యామెను ప్రాధేయపడి వేడింపుడు. నేనును మీ శిష్యుడనై వచ్చి ప్రతిమాలుకొనెదను. దైవముపై భారముంచి సాహసమునఁ గార్యసాధన యొనర్చుడు. ద్రోహచింతయును బయలుపడినది పాపముల క్రోధము సర్వంసహా నాశకారణము. మీ యసూయయే యనసూయ యొద్ద గర్వము కొలగాదు. మీగర్వము ఖడ్గపోటై నిలువ చేయుడు. మీయహంకారము తెలుపుకొను గొఱగావు నామాటలు విని పొండు. వేగమ పొండు. కార్యమిక్కటికి మించిపోయినది. పోయి పాదములపైబడి వేడుకొనుడు.

గౌరి—ఆఁ! అంత హైన్యమున కాలికట్టు మందువా. గత్యంతరము లేదా.

లక్ష్మి—నారదా! సమర్థుఁడవు మతి యొక మార్గము నెఱింగింపుము.

సర—సర్వతంత్రవేదివి. జగముల తల్లుల పరువు నిలుపుము.

నార—పట్టిది. పట్టిది నిలువబోదు. తెగు దనుక బిగియరాదు శీఘ్రముగా నడువుడు. "అన్యథా శరణం నాస్తి త్వమేవ శరణంమమ" అనెడి మంత్రాక్షరములను జపించుచు నామె పాదముల నాశ్రయింపుడు. లేకున్న లోకము లరాజకములు గాగలవు.

## షష్ఠాంకము

### రంగము 3

స్థలము—అత్రిమున్యాశ్రమము.

(తెరయెత్తగా అనసూయయు అనహంక్రియయు మువ్వురు బిడ్డలు నుందురు.)

అన—(అనహంక్రియకుఁ దొట్టిలోని బిడ్డలను చూపుచు వికాసముఖముతో) చూచితివా? నా వ్రతఫలములను, నా తపఃపుంజములను.

అనహం—(బిడ్డలను పరికించిచూచి) ఎంత యదృష్టవంతురాల

అమ్మా! మహాపురుషుల ముమ్మూర్తులఁబోలు బిడ్డల ననా
యాసముగా గర్భధారణమును ప్రసవ వేదనయును లేకయే
పొందఁగలిగితివి.

అన—(ఒకబిడ్డ నెత్తి చూపుచు) వీనిం జూచితివా? నీలమేఘశ్యాము
డమ్మా. వక్షస్థలమున నచ్చముగా శ్రీవత్సమునుబోలి పుట్టు
మచ్చయు నాభియందు సువర్ణకమలంబునుం జూడుము.

అనహాం—(బాగుగా పాదంబులఁ బరిశీలించి) పాదములయందు శంఖ
చక్రములు స్ఫుటముగా నిరాజిల్లుచున్నవి. ఈ భద్రలక్షణము
లన్నియును జగద్వ్యాపకుఁడగు శ్రీవిష్ణుని స్ఫురణకుఁ దెచ్చు
చుండుట లేదా,

అన—(రెండవ బిడ్డను జూపుచు) తారహారహీర డిండీరములం బోని
యీ శుభ్రశరీరమునఁ గంఠమున నీలరేఖచే సర్వజ్ఞశేఖరు
నిం దలంపించుట లేదా.

అనహాం—ఆహా! కాకేమి? ఆ కంఠమునందలి నైల్యము చంద్రునం
దలి మచ్చవలె గనుపించుచుండఁ గాదనుటెట్లు?

అన—అమ్మా! ఇటు ఇటు! వీనిని నాముద్దులవానిని జూచితివా?
కళంకరహిత సుధాకరమండలము గదా వీని ముఖపద్మము.

అనహాం—వేఱ యోచింపనేల? వీరు ముమ్మూర్తులు సృష్టిస్థితిలయ కర్తలు
గాని వేఱుగాదు.

అన—వీరి నెట్లు పిలువవలయునో తోఁచకున్నది.

అనహాం—ఏమని పిలువవలయునా యని యోచనయేల? ఈ శ్యామ
లాంగుని శ్యామసుందరదత్తని యనరాదా.

అన—సరియే! వీనిని దత్తని యందము. మఱి వీనినో (రెండవబిడ్డను
జూపును.)

అనహాం—కల్మషవిదూరుఁడగు నీ శుభ్రశరీరుని—

అన.—సరే యికనేమి! దూరని పిలతము. ఇఁక నీ ముద్దులమూటను
పున్నమవెన్నెలకేట నేమని పిలువవలయును. (అని మూఁడవ
బిడ్డను చేతనందుకొనును)

అనసూ—వీరినింక నిదురలేపి గృహకృత్య నిర్వహణమునకుం బోవల యును గదా. ఈ మువ్వురిలోనుండి యొకజోలం బాడుదమా?

(జోలపాడుదురు-తెరపడును)

## రంగము 4.

స్థలము——అత్రిముని యాశ్రమము, (అనసూయా పార్వతీ లక్ష్మీ సర స్వతులు కూర్చుండియుందురు.)

అన— అమ్మలు— మాయమ్మలు—జగమునమ్మలు--ముగురమ్మలు మాయింటికి కరుణావిశేషమున మాకుటీర నిలయమ్మున కేతెంచి భవ్యమొసర్చితిరి ఆహా! మా భాగ్యమేమి? ఒకతె సర్వమంగళ. ఒకతె భాగ్యాధిదేవత. ఒకతె శారదాంబ. ఇంక మాకేమి కావలయు. చరితార్థుల మైతిమి. మాయదృష్ట మునకు మేమే గర్వించుచున్నాము. తల్లులారా! తాము వచ్చిన కార్యమేమి?

గౌరీ—(అపవారించి) ఆహా! ఏమి యీ సత్కృవినయములు. "అతి వినయం ధూర్తలక్షణం" అనుట సార్థకము గదా! అయినను "కార్యార్థినః కుతో గర్వః" అన్నారు గనుక ఈమెతో మన కేమి? మంచిగా మాటాడి మన భర్తలను చేజిక్కించుకొందము. (ప్రకాశముగా) అమ్మా! అనసూయా! మా త్రిమూర్తులు ఇచ్చటికి వచ్చినారా? ఇల్లు వదలిపోయి యెన్నొ దినము లయినది. ఎచటి కేగినది యెందుల కేగినది చెప్పలేము. వారి వృత్తాంతమేమియును దెలియరాదు. ఇచటం దెలియును గదా! యని వచ్చితిమి.

అన—అమ్మా! తమ భర్తలు సృష్టిస్థితి లయకర్తలు. ఎచ్చటనేనిం గలరు. ఇందు లేరని మాత్రము నేనట్లు చెప్పగలను. సూర్యరశ్మి సోకని ప్రదేశము లేనట్లు సర్వవ్యాపకులైన తమ భర్తలు లేనితావులు లేవుగదా. వారి కోక రూపమూ—యొక నామమూ. వారి నెట్లు వెదుకం గలరు? ఎచ్చట కనుంగొనం గలరు? ఏ రూపని కనుంగొనం గలరు? ఇచ్చటం దెలియును గదా యని

వచ్చితి మంటిరే. ఇది యేమి పట్టణమా? నిర్వ్యాపకముగు నీ మునిపల్లియందు నంత యొుక్క గలవారెవ్వరున్నారు? మేము పతివ్రతా పరిశోధనమైన నెపముగ నే!

లక్ష్మి—(అపవారించి) ఎంత యుక్తిగా మాటలాడుచున్నది. దగ్గరఁ బెట్టుకొనియే యేమి నయగారిమాటలు. ఇంత మాత్రము మనకుఁ దెలియదనుకొన్నదిగాఁబోలు. మానవాంగనకుఁ గల తెలివి తేటలు ప్రకృతి మహాశక్తులకు లేవను కొన్నది. (ప్రకాశముగా) కనుఁగొన శక్తి జాలక చూడఁగల దాన విందు న్నానని యే వచ్చినారము. (అపవారించి) లేడికి కాలము వచ్చి చిక్కినదిగాని కాళ్లులేక చిక్కలేదు. ఆత్మపతుల నెపముగ రే మున్నారమా. అజ్ఞానులయిన మనుష్యాంగన లనుకొంటివా? దివ్యజ్ఞాన సంపన్నులగు శక్తిత్రయమును

అన—అమ్మా! అట్లనుచున్నా రేమి? నేనంతమాత్రపుదాననా? ఈ కార్యము నావలన నేమగును. నాపతియైన నింట లేడుగదా.

సర—పతితయైన గంగాభవానిని పావనమొనర్చిన నీకిది యొక లెక్క యా. ప్రళయము నాపినతల్లివి మాపతులఁ జూపలేవా? (అపవారించి) తలలు మార్పఁగలవు. నీకుఁ దెలియనిదున్నదా. అంతలావు యతి సన్న్యాయముగ మంటఁగలిపితివి.

పార్వ—(అపవారించి) అదియేమిలెక్క. అతితులైన త్రిమూర్తుల నర్భకులఁ జేయలేదా?

లక్ష్మి—(అపవారించి) దివ్యప్రభావయుతులగు దేవతలమని మైపోయి నది. చివరకు మానవ మాత్రులకే లోఁబడిపోవుచున్నాము.

సర—అమ్మా! ఇంటిలో "క్యావు క్యావు" మని యేడ్చు కాలు రెవ రమ్మా. తమకుఁ బిల్లలు లేరుగదా. (అపవారించి) నారద వాక్యము యథార్థమే సుమా. ఈమె యెంత యసాధ్యురాలు. బిడ్డలను గావించి యింటఁ బెట్టుకొనియే యెఱుఁగని తెలఁ గున మాటలాడుచున్నది.

పార్వ—(అపవారించి) ఎన్ని మాయలు నేరక యింతపాటి దైనదా పోకిరిగాక పెద్దమనిషిగాఁడఁట. అట్లే మాటకారి గాక పతివ్రత గానేరదు.

అన—మీరు నాపెంపుడుబిడ్డలు. దైవప్రసాదులు. దాచనేల. నాపాతి వ్రత్యమునకుఁ గలిగిన ఫలభాగధేయములు.

గౌరి—(అపవారించి) ఔరా! ఈమె కెంతగర్వము. తానే పతివ్రత యని గాఁబోలు. తనమాత్రపు వారిక నెచటను లేరనియా? (ప్రకాశముగా) అమ్మా! తమ యభిప్రాయము మాకుఁ జక్కగా బోధపడలేదు. మీరు తల్లిదండ్రులు గన్న బిడ్డలుగారా?

అన—కారు. ముమ్మాటికిని కారు. ఈశ్వరు ననుగ్రహమున నిట్లయ్యె.

గౌరి—(నవ్వుచు) ఈశ్వరు ననుగ్రహమున నిట్లయ్యెనా? త్రిమూర్తి స్వరూపుండగు నీశ్వరుం డనుగ్రహమున నిట్లయ్యెనా?

అన—ఎట్లయినఁ గావచ్చును. ఈశ్వర విలాస మిట్టిదని తెలియఁగ నేరితరము.

లక్ష్మి—అట్టివారి నర్భకులఁగాఁ జేసిన తల్లి కైనఁ దరముగాదా?

అన—అమ్మలారా! మీరేమో యీబిడ్డలను జగత్పతులగు మీపతు లగా భావించుచున్నారు. అది యెంత నిక్కమో నేనెఱుఁ గను. సత్యముఁ జెప్పెద వినుడు: ముగ్గురు యతులు (అపవారించి) యతులో, యతివేషధారులగు మీపతులో (ప్రకాశముగా) ఒకదినమున మాగృహమున కతిథులుగా వచ్చినారు. స్నాన సంధ్యాద్యనుష్ఠానము లైనవి. భోజనమునకుఁ గూర్చుండిరి, "విగతవస్త్రవై వడ్డించినఁగాని భుజింపము. ఇది మావ్రతము" అనిరి. నాకేమియుఁ దోపలేదు. అతిథులను విధ్యుక్తముగ సత్కరింపక విఫలమనోరథుల నొనర్చి పంపుటయు ధర్మముగాదు. వారి వ్రతనియమమును వదలి వారుభుజింపరు. అభిమాన హీనయగు స్త్రీ జీవితము నిరర్థకము. మానహాని కోర్చి వారి కట్లు విందు సేయుదును? కొంత తడవిట్లు వితర్కించి కార్యము తెలియక పతిపాదకమలంబుల మనంబున

నిలుపుకొని ధ్యానించి సలిలముల వారిపైఁ జిలికితిని, వెంటనే వారు బాలకాకృతులఁ దాల్చిరి. అప్పటినుండియు బిడ్డలకై మోహము వాచిన నేనే యనన్యగతికులగు బిడ్డల సాకుకొనుచుంటిని. నమ్ముఁడు నమ్మకుండుడు. వాస్తవ మిది.

ముగ్గురు—అమ్మా! వారు మాపతులని నారదునివలన వినియే వచ్చి యున్నారము. లేకున్న నిచటి కేలవత్తుము.

(నారదుఁడు ప్రవేశించును)

నార—అమ్మా! అనసూయా! పెద్దమ్మల నేలశ్రమపెట్టెదవు? వారి పతులను వారి కొసఁగుము.

అన—ఎవరి పతులెవరో నేనెఱుఁగను. ఈ నా వ్రతఫలముల- నా ముద్దుల బిడ్డల నేనేల విడువ వలయు.

నార—(తనలో) ఇదియేమొ పాశము ముదిరినట్లున్నదే. అయినను ప్రార్థించి చూతునుగాక! (ప్రకాశముగా) జగన్మాతలపైఁ జగవిడుతుము.

అన—జగమేమో- పగయేమో నాకుఁదెలియదు. నాకన్నులఁ గన్న చిన్నారి పొన్నారి నాన్నల ముద్దు మురిపములఁ జూచుకొనని జన్మమేల? ఈబిడ్డలను విడిచిన నాప్రాణములు నిలుచునా? తనకుమాలిన ధర్మమును మొదలు చెడ్డబేరమును గలదా?

గౌరి—అమ్మా! పతినివిడిచి యుండలేక పతి దేహమునం దర్థభాగము నైయుంటిని. పరమసాధ్వికి పతి వియోగ దుఃఖము దుర్భరమని వేర చెప్పవలయునా?

అన—ఏమో! ఎవరివ్యథ వారిది. జగములతల్లివి కడుపుతీపి నెఱుంగకున్నావా?

లక్ష్మి—ఎచటఁదిరిగినను నాపంచప్రాణములు నానాథుని హృదయముననే పొందుపఱచియుందును. అట్టి నన్నుదబాపుట సాధ్వీలక్షణమా. నన్నాతని సాయుజ్యము నొందఁజేయుము.

నార—పలుకుతోడు గచుండు నన్ను నాయకునికి దూరస్థురాలిని గావించితివి గదా. ఇది నీకు భావ్యమా? తెలిసిన తల్లివి తిన్నగా యోచించుకొనుము.

అన—కూర్చుటయేమి, ఎడబాపుట యేమి నేనెఱుంగను, నా కనుల వెలుగులను, నా యాణిముత్యములను, నా ముద్దుల మూటలను, నా యమృతంపు దేటలను బరులకర్పింప మందురా? ఆలోచించుట కేమున్నది. నేను మీయెడ నేమి యపరాధ మొనర్చి యుండలేదు. మీ భావ్యాభావ్యముల నేనెఱుంగను. మీరు పతులైన మిమ్ముల నేలవదలి వత్తురు? అదిగాక జగత్పతులు మీపతులే యనుటయెట్లు?

నార—(తనలో) ఇంక నేనూరకుండ గార్యము కానేరదు. బోరబ చేసికొనవలెను. (ప్రకాశముగా) తల్లీ! పట్టు విడుము. ముగురమ్మలకును తామే సాధ్వులమనెడి గర్వ ముఖర్వమైనది. అపరాధము క్షమించి పతిభిక్ష సేయుము.

ముగ్గురు—(తలలు వంచుకొని లజ్జ నభినయింతురు) కరములు జోడించి తల్లీ! మేమొనర్చిన దుర్ణయమును సైరింపుము.

అన—(తనలో) వైరమునకుం గాలుదువ్విన జగన్మాతలు శిరములు వంచి చేయొగ్గి యాచించుచుండిరిగదా. కాదని త్రోసిపుచ్చుట భావ్యమా, భావ్యాభావ్యము లెట్లున్న పుత్రమోహము విడువనీయకున్న దేమిసేతును.

నార—అనసూయా! సార్థకనామవు. మహాపతివ్రతవు. నేడు సతులను జగన్మాతల దిద్దనేర్చితివి. ఈ కృతాపరాధినుల క్షమించి దయామతి మూర్తిత్రయమును విడచిపుచ్చుము. నీపతి తపఃప్రభావంబునను, నీ పాతివ్రత్య మాహాత్మ్యంబునను, త్రిమూర్త్యంశంబుల నీగర్భంబున దత్తాత్రేయ దూర్వాస చంద్రులుదయింతురు. జగన్మాతల జగన్నాయకులం గూర్చి పుణ్యము గట్టుకొనుము. (అనసూయ పసిబాలురపై మంత్రతీర్థముం జల్లును.) (తెరపడును)

(తెరయెత్తఁగాఁ త్రిమూర్తులు; గౌరీ లక్ష్మీ సరస్వతులు నారదానసూయలు నుందురు.)

త్రిమూర్తులు—నీ పతివ్రతాత్వము జగద్విదితమైనది. ఇఁకఁ గోరవలసిన వరములఁ గోరుము. నీయెడలఁ బ్రసన్నులమైతిమి.

అన—భగవత్ప్రసన్నతకంటెఁ గావలసినదేమి? అయినను కోరుచుంటిరి గానఁ గోరుచుంటి.

గీ. పతులు నమ్రిలా వర పతివ్రతలయెడల
నరక యుద్దండతను జూపకుండ్రగాత
సతుల యున్నతికి ననసూయత వహించి
ప్రకృతి పురుషాళి సుఖవృత్తి వరలుఁగాత!

సంపూర్ణము.



